# తత్సమచంద్రిక.



(ప్రథమభాగము)



సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

1923.

To

Sree Maharaja

SEETHARAMA BHUPAL

Bahadur Varu

OF

GADWAL

(Deccan)

# మనవి.

పండితమహాశయులారా !

ఈ గ్రంథము యొక్క వ్రాతప్రతి మొదట నాగురువర్యులగు శ్రీ॥ శతావధాని వేలూరి శివరామశాస్త్రులవారి గ్రంథములతో పాటు చోరగ్రస్తమయ్యెను. పిదప దీనిని మరలఁ గౌముది నుండి సేకరించునప్పటికి బహుప్రయాసపడితిని. లేకున్న నీగ్రంథ మింతకుముందు రెండుసంవత్సరముల క్రిందటనే ముద్రింపఁబడి యుండెడిది. కాని యిప్పటికైన నీగ్రంథ మిట్టి యాకృతినిఁదాల్చి నందులకు సంతసించుచుంటిని.

ఆంధ్రభాషలో నిట్టిగ్రంథమున కావశ్యకము మిక్కిలి గలదనిన విషయము సర్వజనవిదితము కాని

శ్లో॥ మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామనః ॥

యని మహాకవి కాళిదాసుఁడు వచించినట్లు నావంటి కించిజ్జ్ఞుఁడీ కార్యమున కుఁబూనుట యుపహాసింపఁబడుటకే.

ఇందు ముద్రాదోషములతో పాటు నా స్వల్పజ్ఞతాదోషములుగూడఁ జాలనుండవచ్చును. పండితమహాశయులా యా దోషముల నాకుఁదెలిపిన ద్వితీయముద్రణమున సంస్కరించుకొనియెద.

ఇట్లు
వినీతవశంవదుఁడు,
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

# INTRODUCTION.

This treatise on Grammar is hoped to effectually fill up a deep gap in the field of Telugu Literature and to form a substantial supplement to Telugu Grammar as it now stands. Telugu Literature is mostly enriched by Sanskrit Vocabulary being imported into it under a series of changes in forms and terminations, individually as well as collectively as occuring in Thath-sama Samasams. Now to take one or two concrete xamples భ్రాతృ, పితృ, etc. in Sanskrit are adopted as భ్రాత, పిత; రాత్రి a word in the feminine gender ending in ఇ occurs అ,రాత్రము in త్రిరాత్రము, అర్థరాత్రము How these forms have been arrived at cannot be understood without a knowledge of Sanskrit Grammar, thorough knowledge of which is not given to all. There is at peresent not a single work available on the modle persented to you by the author, or in any other shape, which could enlighten an ardent student to-words a proper and intelligent understanding for the various processes of transformations. Sanskrit words undergo many changes to be finally assimilated and absorbed into the Telugu Literature. Poets and Scholars have no reliable scientific guide to lead them

through the intricacies of the transformation field except the empirical experience they might have gained in a vast course of reading which automatically told them a particular form was correct or not.

In this critical state of affairs the author has come to our aid with his most beautifully condensed and complete treatise on Thathsama Grammar,the value of which cannot be overrated. The author has made a critical study of Sanskrit Grammar and himself being a Telugu scholar and teacher has been able to appreciate the difficulties of Telugu Students and has been, in the interests of such,able to satisfy them in this little work.

I congratulate the author on the happy success that crowned his efforts in bringing out this original work. It is hardly necessary for me to affirm that this work besides supplying the long felt want, will be found of immense use not only to amateur students and poets but also for B. A. and M. A. Class in the Honour's Course.

In conclusion no knowledge of Telugu can be said to be thorough without a study of this treatise.

GADWAL. } (Sd) G. RAMACHNDER RAO.
Samasthan. Dn. } B. A.

ఓమ్.

# తత్సమచంద్రిక.



## అచ్సంధి.

౧. సంస్కృతభాషలోఁబ్రధానమైన యచ్చులు ౫
అ, ఇ, ఉ, ఋ, ఌ,
పరా. మిగిలిన యచ్చులిందుండి కలిగినవే కాని క్రొత్తవి కావు.
అ+అ=ఆ;ఇ+ఇ=ఈ;ఉ+ఉ=ఊ;ఋ+ఋ=ౠ
అ+ఇ=ఏ;అ+ఏ=ఐ;అ+ఉ=ఓ;అ+ఓ=ఔ.
ఎ. ఒ. వర్ణములు కేవలాంధ్రభాషలోనివి. ఌ వర్ణమునకు దీర్ఘము లేదు.

౨. అ. ఇ. ఉ. ఋ. వర్ణములకుఁ గ్రమముగా అ. ఇ. ఉ. ఋ. వర్ణములుపరమైనయెడల దీర్ఘమేకాదేశముగావచ్చును.
ఏకాదేశమనఁగా (బూర్వపరస్థానములందలి రెండువర్ణములునుబోయి యొకవర్ణము వచ్చుట.

### అకారము.

అ+అ=ఆ; దేవ +అగారము =దేవాగారము.
అ+అ=ఆ; దేవ +ఆలయము=దేవాలయము.

ఆ+అ=ఆ; లతా+అంతము =లతాంతము.

ఆ+ఆ=ఆ; మహా+ఆనందము=మహానందము.

౩. ఈక్రిందిశబ్దములలో మాత్రము 'అ'కారమునకు 'అ' కారముగలిపినయెడల 'అ'కారమే యేకాదేశమ్ముగావచ్చును. కలిసినచోట్ల దీర్ఘమేవచ్చును.

అ+అ=అ; శక+అంధువు=శకంధువు.

కర్క+అంధువు=కర్కంధువు.

కుల +అట =కులట

సీమ +అంతము=సీమంతము.

సార +అంగము=సారంగము.

మార్త+అండుడు=మార్తండుడు

ఇకారము.

ఇ +ఇ =ఈ;హరి +ఇందిర=హరీందిరలు.

ఇ +ఈ=ఈ;కవి +ఈశ్వరుడు=కవీశ్వరుడు.

ఈ+ఇ =ఈ;మహీ+ఇంద్రుడు =మహీంద్రుడు.

ఈ+ఈ=ఈ;గౌరీ +ఈశుడు =గౌరీశుడు

ఉకారము.

ఉ +ఉ =ఊ;భాను +ఉదయము +భానూదయము.

ఉ +ఊ=ఊ; ధేను +ఊధస్యము + ధేనూధస్యము.

ఊ+ఉ =ఊ;వధూ+ఉక్తము +వధూక్తము.

ఊ+ఊ=ఊ;వధూ+ఊరీకారము+వధూరీకారము.

## ఋకారము.

ఋ+ఋ=ౠ; పితృ+ఋణము=పితౄణము.
=ఋ ఋ; పితృఋణము.
= ఋ; పితృణము.

సూత్రా. పితృశబ్దమువంటి ఋకారాంత శబ్దములన్నింటికి ఋకారము పరముగానున్న యెడల నీవిధముగా మూఁడురూపములగును.

## ఏకారము.

౮. అకారమునకు ఇ, ఉ వర్ణములు పరమైనయెడలఁ గ్రమముగా ఏ, ఓ కారములేకాదేశములుగావచ్చును.

అ+ఇ=ఏ; దేవ+ఇంద్రుఁడు=దేవేంద్రుఁడు.
అ+ఈ=ఏ; దేవ+ఈశుఁడు=దేవేశుఁడు,
ఆ+ఇ=ఏ; మహా+ఇంద్రుఁడు=మహేంద్రుఁడు.
ఆ+ఈ=ఏ; మహా+ఈశ్వరుఁడు=మహేశ్వరుఁడు.

## ఓకారము.

అ+ఉ=ఓ; చంద్ర+ఉదయము=చంద్రోదయము.
అ+ఊ=ఓ; దేవ+ఊర్జితము=దేవోర్జితము.
ఆ+ఉ=ఓ; మహా+ఉదయము=మహోదయము.
ఆ+ఊ=ఓ; రమా+ఊరీకారము=రమోరీకారము.

## ఐకారము.

౫. అకారమునకు ఏ ఐ, ఓ ఔ వర్ణములు పరమైన యెడల ఐ, ఔ వర్ణములు క్రమముగా వచ్చును.

అ+ఏ=ఐ;కృష్ణ+ఏకత్వము=కృష్ణైకత్వము.

ఆ+ఏ=ఐ;ప్రజా+ఏకీభావము=ప్రజైకీభావము.

అ+ఐ=ఐ;సర్వ+ఐశ్వర్యము=సర్వైశ్వర్యము.

ఆ+ఐ=ఐ;మహా+ఐశ్వర్యము=మహైశ్వర్యము.

## ఔకారము.

అ+ఓ =ఔ;దేవ +ఓకస్సు =దేవౌకస్సు.

ఆ+ఓ =ఔ;మహా+ఓఘము =మహౌఘము.

అ+ఔ=ఔ;కృష్ణ+ఔత్సుక్యము =కృష్ణౌత్సుక్యము.

ఆ+ఔ=ఔ;మహా+ఔత్కంఠ్యము=మహౌత్కంఠ్యము.

౬. ఓతువు, ఓష్ఠము అనుశబ్దముల ఓకారము పరమైన యెడల ఔకారము వికల్పముగా వచ్చును. రానపుడు ఓకారమే యేకాదేశముగా వచ్చును.

వి.రా. వికల్పమనఁగా ఒకమాఱువచ్చుట ఒకమాఱు రాకపోవుట.

అ+ఓ=ఔ,ఓ.బింబ +ఓష్ఠము=బింబౌష్ఠము, బింబోష్ఠము

ఆ+ఓ=ఔ,ఓ.రమా+ఓష్ఠము=రమౌష్ఠము, రమోష్ఠము.

స్థూల+ఓతువు=స్థూలౌతువు, స్థూలోతువు.

మహా+ఓతువు=మహౌతువు, మహోతువు

౭. అకారమునకు "ఓం" వర్ణముపరమైన యెడల ఔకారము రాదు. ఓకారమే యేకాదేశముగా వచ్చును.

"శివాయ+ఓంనమః" "శివాయోంనమః"

౮. ఇ. ఉ. ఋ. ఌ. వర్ణములకు అచ్చులు బరమైనయెడల య, ర, ల, వ, లు క్రమముగావచ్చును.

ఇ+ అ=య; అతి +అధికము =అత్యధికము.
ఉ +అ=వ ;తరు +అగ్రిము =తర్వగ్రిము.
ఋ+ఉ=ర ;సవితృ+ఉదయము=సవిత్రుదయము.
ఌ+ఆ=లా ఌ+ఆకారము=లాకారము.

షరా. ఇ. ఉ. ఋ. ఌ. వర్ణములకు మిగిలిన అజాదిపదములుపెట్టి చూచుకొనవలెను. ఌ. వర్ణము అంతమందుఁగలపదములు లేవు. సంస్కృతధాతువులలో శకౢ, గమౢ, సృపౢ, మొ. ధాతువులు మాత్రముఁగలవు.

౯. అచ్చులకు ఋకారము పరమైన యెడల సంధివికల్పము

అ +ఋ=అర్ ;బ్రహ్మ+ఋషి బ్రహ్మర్షి; బ్రహ్మఋషి.
ఆ +ఋ=అర్ ;మహా +ఋణము మహర్ణము; మహాఋణము
ఇ +ఋ=య్ృ;గిరి +ఋషి గిర్యృషి; గిరిఋషి
ఈ+ఋ=య్ృ;దేవీ +ఋతము దేవ్యృతము; దేవీఋతము
ఉ +ఋ=వ్ృ ;ధేను +ఋషభము ధేన్వృషభములు (ధేను ఋషభములు)
ఊ+ఋ=వ్ృ ;వధూ +ఋణము వధ్వృణము; వధూఋణము

ఋరా. ఋకారమునకు ఋకారము పరమైనయెడ ఋకార సంధిలో విశేషము సూపఁబడినది. ఏకారాంతశబ్దము లేదు.
ఓ, ఔ. ఐకారాంతశబ్దములకు ఋకారాము పరమైనప్పుడగు రూపములుక్రింది సూత్రోదాహరణములలోఁ దెలియును.
౧౦. గో శబ్దమునకు అకారాదిపదము పరమైన యెడల 'గవ' ఆదేశము బహుళముగావచ్చును. *బహుళగ్రహణముచే నొకమారు ప్రకృతిభావమునునొకమారు పరమైన అకారమునకు లోపంబును వచ్చును.
గో+అశ్వములు.గవ+అశ్వములు. గవాశ్వములు(గవాదేశము)
గో+అశ్వములు గోఅశ్వములు (ప్రకృతిభావము)
గో+అశ్వములు గోశ్వములు (అకారలోపము)
౧౧. గోశబ్దంబునకు ఆకారాద్యచ్చులుబరమైనప్పుడు గవ, గవ్ గ ఆదేశంబులువచ్చును.
గ ఆదేశమునందు సంధిరాదు.
గో+ఆలయము. గవ+ఆలయము. గవాలయము.
గవ్+ఆలయము గవాలయము.

---

*బహుళమనఁగా విధింపఁబడిన కార్యము గొన్నిచోట్ల నిత్యముగావచ్చుట, కొన్నిచోట్ల వికల్పముగావచ్చుట, కొన్నిచోట్ల రాకుండుట, కొన్నిచోట్లఁజెప్పఁబడినకార్యమేకాక మరొకకార్యమును మరికొన్నికార్యములును వచ్చుట ఇందుఁజెప్పఁబడిన నాల్గు ఘములును లక్ష్యమునుసరించియుండును మనయిచ్చవచ్చినట్లు విధింపరాదు.

| | | |
|---|---|---|
| | గ + ఆలయము, | గఆలయము. |
| గో + ఇందువు. | గవ + ఇందువు. | గవేందువు. |
| | గవ్ + ఇందువు. | గవిందువు. |
| | గ + ఇందువు. | గఇందువు. |
| గో + ఈశుఁడు, | గవ + ఈశుఁడు. | గవేశుఁడు. |
| | గవ్ + ఈశుఁడు. | గవీశుఁడు. |
| | గ + ఈశుఁడు. | గఈశుఁడు. |
| గో + ఉత్కారము. | గవ + ఉత్కారము. | గవోత్కారము. |
| | గవ్ + ఉత్కారము. | గవుత్కారము. |
| | గ + ఉత్కారము. | గఉత్కారము. |
| గో + ఊధస్యము. | గవ + ఊధస్యము. | గవోధస్యము |
| | గవ్ + ఊధస్యము. | గవూధస్యము. |
| | గ + ఊధస్యము. | గఊధస్యము. |
| గో + ఋషభములు. | గవ + ఋషభములు. | గవర్షభములు. |
| | | గవఋషభములు. |
| | గవ్ + ఋషభములు. | గవృషభములు. |
| | గ + ఋషభములు. | గఋషభములు. |
| గో + ఏధితము. | గవ + ఏధితము. | గవైధితము. |
| | గవ్ + ఏధితము. | గవేధితము. |
| | గ + ఏధితము. | గఏధితము. |
| గో + ఐశ్వర్యము. | గవ + ఐశ్వర్యము. | గవైశ్వర్యము. |
| | గవ్ + ఐశ్వర్యము. | గవైశ్వర్యము. |
| | గ + ఐశ్వర్యము. | గఐశ్వర్యము. |

గో + ఓఘము. గవ + ఓఘము. గవౌఘము.
గవ్ + ఓఘము గవోఘము.
గ + ఓఘము. గఓఘము
గో + ఔషధము. గవ + ఔషధము. గవౌషధము.
గవ్ + ఔషధము. గవౌషధము.
గ + ఔషధము. గఔషధము.

షరా. ఈ, గో, శబ్దమునకు ఇంద్రశబ్దము పరమైనయెడల 'గవేంద్రుఁడు' అనియొక్కరూపమేకాని గవేందువు, గవిందువు, గఇందువు అని పైనిఁజూపినట్లు గవేంద్రుఁడు, గవింద్రుఁడు, గఇంద్రుఁడుఅని మూఁడురూపములుండవు.

౧౨ రై, గ్లౌ, శబ్దంబుల కచ్చుపరంబైనయెడలఁ గ్రమముగా రాయ్, గ్లావ్, ఆదేశములువచ్చును.
రై + ఆశ = రాయ్ + ఆశ = రాయాశ (ధనాశ)
గ్లౌ + ఉదయము = గ్లావ్ + ఉదయము = గ్లావుదయము మొ.

అచ్సంధి సంపూర్ణము.

—:o:—

## హల్సంధి.

### హల్లుల సహజ రూపములు.

క్, ఖ్, గ్. ఘ్, ఙ్, చ్, ఛ్, జ్, ఝ్, ఞ్, ట్, ఠ్, డ్, ఢ్, ణ్, త్, థ్, ద్, ధ్, న్, ప్, ఫ్, బ్, భ్, మ్, య్, ర్, ల్, వ్, శ్, ష్, స్, హ్, ళ్.

౧. క, చ, ట, త, ప,లకు అచ్చులును (క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స, వర్ణముల కంటెభిన్నములైన) హల్లులును బరమైనయెడల గ, జ, డ, ద, బ,లు క్రమముగావచ్చును
వాక్+ఈశుఁడు=వాగ్+ఈశుఁడు=వాగీశుఁడు.
అచ్+అంతము=అజ్+అంతము=అజంతము.
రాట్+ఆదులు=రాడ్+ఆదులు= రాడాద్యులు.
మరుత్+ఈశుఁడు. మరుద్+ఈశుఁడు. మరుదీశుఁడు.

| | | |
|---|---|---|
| కకుప్+అధిపతి | కకుబ్+అధిపతి | కకుబధిపతి. |
| దిక్ +దంతి | దిగ్ +దంతి | దిగ్దంతి. |
| అచ్ +లోపము | అజ్ +లోపము | అజ్లోపము. |
| రాట్+గణము | రాడ్ +గణము | రాడ్గణము. |
| తత్ +దినము | తద్ +దినము | తద్దినము. |
| అప్ +రాశి | అబ్ +రాశి | అబ్రాశి. |

సూ. దవర్ణమునకు జ, ఝ, డ, థ, ల, వర్ణములు పరమైనయెడలఁగొంతవిశేషముగలదు. అది ముందుఁ జూపఁబడును.
న, మ, హ, వర్ణములు పరముగానుండఁగా క, చ, ట, త, ప,లకు గజడదబల్పైసూత్రముచే వచ్చియింకను గొంత విశేషమును బొందును. అదియు ముందుఁ జూపఁబడును.

౨. దవర్ణమునకు జ, ఝ, వర్ణములు పరమైనయెడల జకారము వచ్చును,

---

క, చ, ట, త, ప, మొదలగు వర్ణములయందలి అకార ముచ్చారణ సౌకర్యముకొఱకు గ్రహింపఁదగినది.

తత్ + జాతి = తద్ + జాతి = తజ్ + జాతి = తజ్జాతి.

తత్ + ఝరము. తద్ + ఝరము. తజ్ + ఝరము = తజ్ఝరము.

3. దవర్ణమునకు డ, ఢ, వర్ణములు పరమైనయెడల డ వర్ణము వచ్చును.

తత్ + డమరువు. తద్ + డమరువు. తడ్ + డమరువు = తడ్డమరువు.

తత్ + ఢాలము. తద్ + ఢాలము. తడ్ + ఢాలము = తడ్ఢాలము

౪. దవర్ణమునకు లకారము పరమైన యెడల లకారము వచ్చును.

సత్ + లలితము సద్ + లలితము. సల్ + లలితము = సల్లలితము

షరా. మొదటిసూత్రముచే తకారమునకు దకారము వచ్చును.

౫. గ, జ, డ, ద, బ, వర్ణములకు పరమైన హకారమునకు ఘ, ఝ, ఢ, ధ, భ వర్ణములు క్రమముగా వికల్పముగా వచ్చును.

వాగ్ + హరి. వాగ్ + ఘరి = వాగ్ఘరి; వాగ్హరి.

అజ్ + హల్లులు అజ్ + ఝల్లులు. అజ్ఝల్లులు; అజ్హల్లులు.

రాడ్ + హంత. రాడ్ + ఢంత రాడ్ఢంత; రాడ్హంత.

తద్ + హితము. తద్ + ధితము. తద్ధితము; తద్హితము.

కకుబ్ + హస్తి. కకుబ్ + భస్తి. కకుబ్భస్తి; కకుబ్హస్తి

షరా. పైజోట్ల ౧వ సూత్రముచే కచటతపలకు గ, జ, డ, ద, బ, లు వచ్చును.

౬. గ, జ, డ, ద, బ, లకు న, మ, వర్ణములు పరముగానున్న యెడల ఙ, ఞ, ణ, న, మ, వర్ణములు క్రమముగావచ్చును. ఇది వికల్పము.

వాగ్ + నైపుణ్యము=వాఙ్నైపుణ్యము; వాగ్నైపుణ్యము.
వాగ్ + మాధుర్యము=వాఙ్మాధుర్యము; వాగ్మాధుర్యము.
అజ్ + మననము. అఞ్మననము; అజ్మననము.
అజ్ + నవకము. అఞ్నవకము; అజ్నవకము.
రాడ్ + నిలయము. రాణ్నిలయము; రాడ్నిలయము.
రాడ్ + మూర్తి. రాణ్మూర్తి; రాడ్మూర్తి.
జగత్ + నాథుఁడు జగన్నాథుఁడు; జగద్నాథుఁడు.
జగద్ + మాత. జగన్మాత; జగద్మాత.
అబ్ + నాథుఁడు అమ్నాథుఁడు; అబ్నాథుఁడు.
కకుబ్ + మహిళ. కకుమ్మహిళ; కకుబ్మహిళ.

పరా. మొదటి సూత్రముచే క,చ,ట,త,ప,లకు గ,జ,డ,ద,బ,లు వచ్చును.

౭. గ, జ, డ, ద, బ, వర్ణములకు మయము మాత్రము, మొదలైన మకారాది ప్రత్యయములు పరమైన యెడల ఙ,ఞ,ణ,న, మ వర్ణములు క్రమముగానిత్యముగావచ్చును.

వాగ్+మయము=వాఙ్మయము.
అజ్ + మాత్రము=అఞ్మాత్రము.
రాడ్+మాత్రుఁడు=రాణ్మాత్రుఁడు.
చిద్ + మయము=చిన్మయము.
అబ్ + మయము=అమ్మయము,

౮. క, చ, ట, త, ప, లకు పరముగానున్న శకారమునకు ఛకారము వికల్పముగావచ్చును.

వాక్ + శరము వాక్ఛరము; వాక్శరము.

అచ్ + శతము అచ్ఛతము; అచ్శతము.
రాట్ + శాసనము రాట్ఛాసనము; రాట్శాసనము.
తత్ + శాస్త్రము. తచ్ఛాస్త్రము; తచ్శాస్త్రము.
అప్ + శీకరము; అప్ఛీకరము; అప్శీకరము.
షరా. మొదటిసూత్రములో క,చ,ట,త,ప,లకు, గొన్నివర్ణము లుపరమైన గ,జ,డ,ద,బ,లురావని చెప్పఁబడెను. ఆవర్ణములలో శ,వర్ణము జేరినది. పైఁజెప్పఁబడిన యుదాహరణములలో తత్ + శాస్త్రముఅనుచోట శకారమునకుఛకారము వచ్చుటయేకాక తకారమునకు చకారమువచ్చినది ఇది యీక్రిందిసూత్రముచేఁ దెలుపఁబడును.
౯. తవర్ణమునకు చ, ఛ, శ,వర్ణములు పరమైనచో చవర్ణము వచ్చును.
మరుత్ + చలనము. (మరుచ్ + చలనము) మరుచ్చలనము.
చలత్ + ఛదము. (చలచ్ + ఛదము) చలచ్ఛదము.
లసత్ + శాంతి. (లసచ్ + ఛాంతి) లసచ్ఛాంతి; లసచ్శాంతి.
షరా. లసచ్ఛాంతి. లసచ్శాంతియనుచోట ౮వ సూత్రముచే వికల్పము.
౧౦ తవర్ణమునకు ట, ఠ, వర్ణములు పరమైనచో టవర్ణము వచ్చును.
తత్ + టీక = తట్ + టీక = తట్టీక.
తత్ + ఠక్కురులు. తట్ = ఠక్కురులు. = తట్ఠక్కురులు.
౧౧ సకారాంతములగు (మనస్) మొదలగు శబ్దములకు చ,ఛ, వర్ణములు పరమైనయెడల సకారమునకు శకారమువచ్చును.

మనస్+చలనము=మనశ్+చలనము=మనశ్చలనము.

దుస్+చరిత్రము. దుశ్+చరిత్రము=దుశ్చరిత్రము.

౧౨. సకారాంతపదముల సకారమునకు శకారము పరమైన యెడల నొకసారి శకారమును నొకసారి విసర్గమును వచ్చును.

మనస్+శాంతి=మనశ్+శాంతి=మనశ్శాంతి; మనఃశాంతి

దోస్+శక్తి=దోశ్+శక్తి=దోశ్శక్తి; దోఃశక్తి

౧౩. సకారాంతపదముల సకారమునకు క, ఖ, ప, ఫ, వర్ణములు పరమైన యెడల విసర్గమువచ్చును.

మనస్+కమలము=మనఃకమలము.

మనస్+క్షోభము=మనఃక్షోభము.

మనస్+ఖేదము=మనఃఖేదము.

తపస్+ఫలము=తపఃఫలము.

పయస్+పానము=పయఃపానము.

షరా. సకారాంతశబ్దమునకు క్షకారము పరముగానుండ క్షకారములో కకారము మొదటిదికాన విసర్గముచెప్పఁబడియే యున్నది. (మనఃక్షోభము) దీనినుచ్చరించుటలో విసర్గములేనట్లుగాక విసర్గముగూడ స్ఫుటముగా వినఁబడునట్లు రెండుపదములును విడివిడిగానుచ్చరింపవలెను.

౧౪. అవ్యయముకాని సకారాంతపదముయొక్క సకారమునకు పాశ, కల్ప, క, ప్రత్యయములు పరమైనప్పుడు విసర్గమురాదు.

పయస్+పాశము. పయస్పాశము.

యశస్+కల్పము, యశస్కల్పము.

యశస్+క (కలవాఁడు) యశస్కుఁడు.

షరా. అవ్యయసకారము నిషేధింపఁబడుటచే దానికి విసర్గమే వచ్చును.

ప్రాతస్+కల్పము. ప్రాతఃకల్పము. మొ.

౧౫. అవ్యయముకాని 'అస్' అంతపదముయొక్క సకారమునకు 'కృఞ్' ధాతుకృదంత రూపములును 'కము' ధాతు కృదంతరూపములును కంస, కుంభ, పాత్ర, కుశ, కర్ణి, శబ్దములును బరమైనయెడ విసర్గమురాదు.

కృఞ్, ధాతుకృదంతరూపములు:—

కారము, కారుఁడు, కృతి, కారి, కారిణి, కార్యము కృత్యము కారకుఁడు, కారిక, కుర్వాణుఁడు, కుర్వత్, కర్తృ, కరణీయము కర్తవ్యము. మొ.

కముధాతుకృదంత రూపములు.

కామము, కాముఁడు, కాంతుడు, కాంత, కాంతము, కామి, కామిని, కాముకుఁడు, కమిత, కమ్రము, కామన. మొ.

అయస్+కారుఁడు=అయస్కారుఁడు.

శ్రేయస్+కాముఁడు=శ్రేయస్కాముఁడు.

అయస్+కాంతము=అయస్కాంతము.

పయస్+కుంభము=పయస్కుంభము.

అయస్+పాత్రము=అయస్పాత్రము.

పయస్+కుశలు=పయస్కుశలు.

అయస్+కర్ణి=అయస్కర్ణి. మొ.

షరా. అసంతమగు అవ్యయముని షేధింపఁబడుటచే దాని సకా
రమునకు విసర్గమువచ్చును.

స్వస్+కాముఁడు. స్వఃకాముడు. మొ.

౧౬. అథస్, శిరస్, శబ్దముల సకారమునకు పదశబ్దము పరమైన
యెడల విసర్గమురాదు.

అథస్+పదము=అథస్పదము.

శిరస్+పదము=శిరస్పదము.

షరా. పైఅయస్కారుఁడు మొదలగు శబ్దములును అథస్పదము
శిరస్పదము మొదలగు శబ్దములును సమాసములో
మొదటిపదముగానున్నప్పుడేవిసర్గము రాదుగాని రెండవ
పదముగాఁగాని మూఁడవపదముగాఁగాని యున్నయెడల
విసర్గమువచ్చును.

పరమయశఃకారుఁడు; పరమశిరఃపదము. మొ.

౧౭. తిరస్, నమస్ శబ్దములకు 'కృఞ్' ధాతురూపములు పర
మైన యెడల సకారమునకు వికల్పముగా విసర్గము
వచ్చును.

నమస్+కారము=నమఃకారము; నమస్కారము,

తిరస్+కారము=తిరఃకారము; తిరస్కారము

౧౮. పురస్ శబ్దమునకు కృఞ్, ధాతురూపములు పరమై
యెడల విసర్గమురాదు.

పురస్+కారము=పురస్కారము.

షరా. ౧౫వ సూత్రముచే పురస్ అవ్యయమగుటచే స్వఃక

**ము**ఁడు అనుచోటు నందువలె విసర్గము ప్రాప్తింపఁగా నీ సూత్రముచే నిషేధము.

౧౯. ఇస్, ఉస్, అంతశబ్దముల సకారమునకు క, ఖ, ప, ఫ, వర్ణములు పరమైనయెడల షకారమువచ్చును.

నిస్+కారణము=నిష్కారణము.
బహిస్+కారము=బహిష్కారము.
దుస్+కరము=దుష్కరము.
ప్రాదుస్+కారము=ప్రాదుష్కారము,
సర్పిస్+కుండిక=సర్పిష్కుండిక.
సర్పిస్+పాత్రము=సర్పిష్పాత్రము.
ధనుస్+కపాలము=ధనుష్కపాలము.
ధనుస్+ఖండము=ధనుష్ఖండము.
ధనుస్+ఫలకము=ధనుష్ఫలకము.

షరా. **ము**హుస్ శబ్దమునకు షకారమురాదు. **ము**హుఃకామ. అవ్యయంబులుకాని సర్పిస్, ధనుస్, మొదలగు ఇస్, ఉస్, అంతపదములు సమాసాదియందున్నప్పుడే షకార**ము**ను బొందునుగాని పూర్వపదమును గలిగియున్నయెడల షకారమును బొందవు.

పరమసర్పిఃకుండికమొ. ఇచ్చట ౧౩వ సూత్రముచే విసర్గము వచ్చును.

౨౦. సకారమునకు ష, ట, వర్ణములు పరముగానున్నయెడల షకారమువచ్చును. షకారము పరమైనయెడల నొకసారి విసర్గమువచ్చును.

మనస్+షట్పదము=మనష్షట్పదము; మనఃషట్పదము.
చతుస్+షష్టి=చతుష్షష్టి; చతుఃషష్టి.
అయస్+టంకము=అయష్టంకము.

౨౧. 'అస్' అంతపదమునకు అకారముపరమైనయెడల (అస్+అ) యీ రెండును లోపించి ఓ కారమువచ్చును.

మనస్+అభిలాషము(మన్+ఓ+భిలాషము)=మనోऽభిలాషము

౨౨. 'అస్' అంతపదమునకు ఆకారాద్యచ్చులు పరమైనపుడు సకారమునకు లోపయకారములు వచ్చును.
సకారలోపమందు సంధిరాదు.

మనస్+ఆనందము=మనఆనందము; మనయానందము.
పయస్+ఓఘము=పయఓఘము; పయయోఘము.

౨౩. 'అస్' అంతపదమునకు క,ఖ,చ,ఛ,ట,ఠ,త,థ,ప,ఫ,శ,ష,స,హల్లులుతక్కిన హల్లులు పరమైనప్పుడు 'అస్' నకు ఓకారమువచ్చును.

మనస్+గతి=మన్+ఓ+గతి=మనోగతి.
అయస్+ఘంట=అయోఘంట.
మనస్+జవము=మనోజవము.
సర్వతస్+ఝుంకృతి=సర్వతోఝుంకృతి.
పయస్+డంబరము=పయోడంబరము.
యశ+ఢక్క=యశోఢక్క
మనస్+దయితుఁడు=మనోదయితుఁడు.
తపస్+ధనము=తపోధనము.

మనస్+నేత్రము=మనోనేత్రము.
తపస్+బలము=తపోబలము.
శిరస్+భారము=శిరోభారము.
శ్రేయస్+మూర్తి=శ్రేయోమూర్తి.
మనస్+యంత=మనోయంత.
మనస్+రథము=మనోరథము.
మనస్+వేగము=మనోవేగము.
పయస్+వేశంతము=పయోవేశంతము.
తపస్+హోమము=తపోహోమములు.

౨౮. ఇకారాద్యచ్చులు పూర్వమందుఁగల సకారమునకు (క చ ఛ ట ఠ త థ ప ఫ శ ష స వర్ణములుగాక) మిగి యచ్చులును హల్లులును బరమైనయెడల రేఫమువచ్చు

బహిస్+అంగము=(బహిర్+అంగము)=బహిరంగము
ఆశీస్+ఆరవము=ఆశీరారవము.
దుస్+అంతము=దురంతము.
ఉచ్చైస్+ఆరవము=ఉచ్చైరారవము.
దోస్+అంతరము=దోరంతరము.
బహిస్+గమనము=బహిర్గమనము.
ఆశీస్+నాదము=ఆశీర్నాదము.
చతుస్+ముఖుఁడు=చతుర్ముఖుఁడు.
ఉచ్చైస్+ధ్వని=ఉచ్చైర్ధ్వని.
దోస్+బలము=దోర్బలము. మొ.

౬౧. సూత్రములో నిషేధింపఁబడిన హల్లులు పరమైనచో వచ్చు సంధులు చెప్పఁబడియే యుండెను. సకారమునకు రేఫము పరమైనయెడలఁ గొంతవిశేషముగలదు. అది ౭౬వ సూత్రమునఁజెప్పఁబడును.

౭౫. స్వస్, అంతస్, ప్రాతస్, పునస్, అహస్, శబ్దముల సకారమునకు (క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష,స, వర్ణములకంటె భిన్నములైన) హల్లులును అచ్చులును బరమైనయెడల రేఫమువచ్చును.

స్వస్+ఆనందము=స్వరానందము.

అంతస్+అంగము=అంతరంగము.

ప్రాతస్+అశనము=ప్రాతరశనము.

పునస్+ఆగమనము=పునరాగమనము.

అహస్+అహము=అహరహము.

అహస్+గణము=అహర్గణము.

స్వస్+గంగ=స్వర్గంగ.

అంతస్+భాగము=అంతర్భాగము. మొ.

౬౨. అహస్ శబ్దమునకు పతిశబ్దము పరమైనయెడల సకారమునకు రేఫము వికల్పముగావచ్చును.

అహర్పతి; అహఃపతి.

వికల్పపక్షమందు ౧౩వ సూత్రముచే విసర్గను వచ్చును.

౭౬. పైశబ్దములయు ఇకారాద్యచ్చులు పూర్వమందుఁగల సకారాంతపదములయు సకారమునకు రేఫముపరమైనపుడు

సకారలోపంబును బూర్వాచ్చునకు దీర్ఘంబునువచ్చును.

స్వస్+రాజ్యము=స్వారాజ్యము.
అంతస్+రోగము=అంతారోగము.
ప్రాతస్+రాగము=ప్రాతారాగము.
పునస్+రావము=పునారావము.
అహస్+రాజు=అహోరాజు.
అర్చిస్+రక్తిమ=అర్చీరక్తిమ.
ధనుస్+రావము=ధనూరావము.
ఆశీస్+రావము=ఆశీరావము.
ఉచ్చైస్+రావము=ఉచ్చైరావము.

షరా. ఆశీస్ మొదలగు దీర్ఘాక్షరముముందుఁగల సకారాంత శబ్దములకు సకారలోపముమాత్రమే చాలును.

షరా. అహస్ శబ్దమునకు రూపర్త్రాత్రిరథంతర శబ్దములు బరమైనయెడల 'అస్' నకు ఓకారమువచ్చును.

అహోరూపము, అహోరాత్రము, అహోరథంతరము.
మిగిలిన రేఫము పరమైనపుడు లోపమును పూర్వాచ్చునకు దీర్ఘమునగును.

షరా. స్వర్, అంతర్, ప్రాతర్, పునర్, అనిసంస్కృతవ్యాకరణములోనీనాలుఁగును రేఫాంతములుగాఁజెప్పఁబడినను అహస్ అనునది నకారాంతముగాఁ జెప్పఁబడినను నిఁదు సకారాంతత్వమాశ్రయింపఁబడినవి.

౨౭. పుం శబ్దమునకు అచ్చులు ను, య, ర, ల, వ, అను బర మాదులుగల క,ఖ,చ,ఛ,ట,ఠ,త,థ,ప,ఫ, వర్ణములు పరమైనపుడు 'పుంస్' ఆదేశమువచ్చును.

పుం+కలహంసము=పుంస్కలహంసము.

పుం+కాకము=పుంస్కాకము.

పుం+కిన్నరులు=పుంస్కిన్నరులు.

పుం+కీరము=పుంస్కీరము.

పుం+కుక్కురము=పుంస్కుక్కురము.

పుం+కూటము=పుంస్కూటము.

పుం+కృతి=పుంస్కృతి.

పుం+కేశములు=పుంస్కేశములు.

పుం+కోకిలము=పుంస్కోకిలము.

పుం+క్రౌంచము=పుంస్క్రౌంచము.

పుం+క్లమము=పుంస్క్లమము.

పుం+క్వాథము=పుంస్క్వాథము.

పుం+ఖంజనము=పుంస్ఖంజనము.

పుం+ఖాటి=పుంస్ఖాటి.

పుం+ఖిన్నము=స్ఖిన్నము

పుం+ఖుర్దనము=పుంస్ఖుర్దనము,

పుం+ఖేల=పుంస్ఖేల.

మరా. ౧౩వ సూత్రముచే విధింపఁబడిన విసర్గమీసూత్రమునఁ బ్రవర్తింపదని తెలిసికొనవలెను.

పుం+ఖోలకము=పుంష్ఖోలకము.
1 పుం+చక్రవాకము=పుంశ్చక్రవాకము.
పుం+చిహ్నము=పుంశ్చిహ్నము.
పుం+చీరము=పుంశ్చీరము.
పుం+చుంబనము=పుంశ్చుంబనము.
పుం+చూడామణి=పుంశ్చూడామణి.
పుం+చేలము=పుంశ్చేలము.
పుం+చైతన్యము=పుంశ్చైతన్యము.
పుం+చోదనము=పుంశ్చోదనము.
పుం+చౌర్యము=పుంశ్చౌర్యము.
పుం+చ్యుతి=పుంశ్చ్యుతి.
పుం+ఛగలము=పుంశ్ఛగలము.
పుం+ఛాగము=పుంశ్ఛాగము.
పుం+ఛిద్రితము=పుంశ్ఛిద్రితము,
పుం+ఛురిక=పుంశ్ఛురిక.
పుం+ఛోటిక=పుంశ్ఛోటిక.
2 పుం+టంకము=పుంష్టంకము,
పుం+టిట్టిభము=పుంష్టిట్టిభము.
పుం+టీక=పుంష్టీక.
పుం+ఠక్కురుఁడు=పుంష్ఠక్కురుఁడు.

. ౧౧వ సూత్రముచే సకారమునకు శకారమువచ్చును.
2 ౨౦వ సూత్రముచే సకారమునకు షకారమువచ్చును.

పుం+తపస్సు=పుంస్తపస్సు.
పుం+తాపము=పుంస్తాపము.
పుం+తీర్ణము=పుంస్తీర్ణము.
పుం+తుందము=పుంస్తుందము.
పుం+తూలము=పుంస్తూలము.
పుం+తృణీకారము=పుంస్తృణీకారము.
పుం+తేజము=పుంస్తేజము.
పుం+తైజసము=పుంస్తైజసము.
పుం+తోకము=పుంస్తోకము.
పుం+తౌల్యము=పుంస్తౌల్యము.
పుం+త్రయము=పుంస్త్రయము.
పుం+త్వచము=పుంస్త్వచము.
* పుం+పంచాస్యము=పుంస్పంచాస్యము.
పుం+పారావతము=పుంస్పారావతము.
పుం+పికము=పుంస్పికము.
పుం+పీఠము=పుంస్పీఠము.
పుం+పుంగవుఁడు=పుంస్పుంగవుఁడు
పుం+పూజ్యుఁడు=పుంస్పూజ్యుఁడు.
పుం+పృథుకుఁడు=పుంస్పృథుకుఁడు.
పుం+పేయము=పుంస్పేయము.
పుం+పైశున్యము=పుంస్పైశున్యము.
పుం+పోతము=పుంస్పోతము.

పుం+పౌత్రుఁడు=పుంస్పౌత్రుఁడు.
పుం+ప్రజ=పుంస్ప్రజ.
పుం+ప్లవంగము=పుంస్ప్లవంగము.
పుం+ఫణి=పుంస్ఫణి.
పుం+ఫాలము=పుంస్ఫాలము.
పుం+ఫుల్లరీకము=పుంస్ఫుల్లరీకము.
పుం+ఫేరవము=పుంస్ఫేరవము.

షరా. సూత్రములో అచ్చులును య,ర,ల,వ,లును బరమైయుండఁ గల కొన్ని హల్లులు చెప్పఁబడెను. ఇందుఁజూపిన యుదాహరణములలో అన్నియచ్చులును య,ర,ల,వలును బరముగానున్న యుదాహరణములు చూపఁబడలేదు. భాషలో నింతకంటె అచ్చులును య,ర,ల,వలును బరముగానున్న క,ఖ,చ,ఛ,ట,ఠ,త,థ,ప,ఫ, వర్ణములులేవు.

౨౮. హ్రస్వాక్షరమునకు ఛకారము పరముగానుండఁగా చకారమంతాగమముగావచ్చును.

శివ+ఛాయ+శివచ్+ఛాయ=శివచ్ఛాయ
తరు+ఛాయ+తరుచ్+ఛాయ=తరుచ్ఛాయ.

౨౯. దీర్ఘాక్షరమునకు ఛకారముపరముగానున్న చకారము వికల్పముగా అంతాగమముగావచ్చును

* ౧౩వ సూత్రముచే విధింపఁబడిన విసర్గమిచ్చటరాదని తెలిసికొనవలెను.

లక్ష్మీః+ఛాయ+లక్ష్మీశ్+ఛాయ=లక్ష్మీశ్ఛాయ.

శాఖా+ఛాయ+శాఖాచ్+ఛాయ=శాఖాచ్ఛాయ.

౩౦. గిర్, ధూర్, శబ్దములకు పతిశబ్దము పరమైనయెడల రేఫమునకు వికల్పముగా విసర్గమువచ్చును.

గిర్+పతి=గీఃపతి; గీర్పతి.

ధూర్+పతి=ధూఃపతి; ధూర్పతి.

పరా. గీఃపతి శబ్దమునకు గీష్పతి యనియును వాడుక కలదు.

హల్సంధి

సంపూర్ణము.

——:o:——

## స్త్రీప్రత్యయములు.

---

౧. అకారాంత ప్రాతిపదికంబునకు స్త్రీత్వవివక్షయందు 'ఆ' కారమంతాదేశముగావచ్చును.

జ్యేష్ఠ—జ్యేష్ఠా.
కనిష్ఠ—కనిష్ఠా.
మధ్యమ—మధ్యమా.

౨. 'అకా'ంతములకు స్త్రీత్వవివక్షయందు 'అకా' లోని అకారమునకు ఇత్వమువచ్చును.

కారక — కారికా.
గ్రాహక — గ్రాహికా.
మామక — మామికా.
నరక — నరికా.

వరా. ఈక్రిందిపదములకు ఇత్వము వికల్పము.

సూతికా—సూతకా.
బృందారికా—బృందారకా.
అజికా—అజకా.
వర్తికా—వర్తకా.
పుత్రికా—పుత్రకా.

ఈక్రిందిపదములకు ఇత్వమురాదు.



క్షిపకా—క్షిపకా.

ధ్రువకా—ధ్రువకా.

తారకా—తారకా. (గుడ్డు)

కన్యకా—కన్యకా.

చటకా—చటకా.

వర్ణకా—వర్ణకా (తాంతవము)

ఉపత్యకా—ఉపత్యకా

అష్టకా—అష్టకా (పితృదైవత్యము)

షరా. 'నగరి బహుపరివ్రాజక' మొదలగు బహువ్రీహి సమాసమందలి అకలోని అకారమునకు ఇత్వమురాదు.

తారకా, వర్ణకా, అష్టకా శబ్దములకు కుండలీకరణము ( ) లోనియర్థములందేకాక భిన్నార్థములందు ఇత్వమురావచ్చును.

తారికా, వర్ణికా, అష్టికా.

౩. స్వార్థమందు 'క' ప్రత్యయమువచ్చును.

శాబము శాబకము మొ.

౪. ఆ, ఈ, ఊ, వర్ణాంతములగు నిత్యస్త్రీలింగములకు (స్వార్థయందు వచ్చిన) కావర్ణము పరముగానుండ హ్రస్వము వచ్చును.

ఆర్యా+కా=ఆర్యకా.

కేళీ+కా=కేళికా.

వధూ+కా=వధుకా.

౫. పైసూత్రముచే హ్రస్వమువచ్చిన 'యకార కకార' ముల మీఁది అకారమునకు వికల్పముగా ఇత్వమువచ్చును.

ఆర్యా+కా=ఆర్యకా; ఆర్యికా.
చటకా+కా=చటకకా; చటకికా.

౬. ఆకారాంతనిత్య స్త్రీలింగములకు (స్వార్థమందు వచ్చిన) కాప్రత్యయము పరమైనయెడల హ్రస్వము వికల్పముగా వచ్చును హ్రస్వమునకు ఇత్వము వికల్పము.

గంగా+కా=గంగకా; గంగికా; గంగాకా.
క్రీడా+కా; క్రీడకా; క్రీడికా; క్రీడాకా.

౭. ఇన్నంతములకు స్త్రీత్వవివక్షయందుఁ జివరినకారముమీఁద ఈకారమువచ్చును.

గుణిన్+ఈ=గుణినీ.
స్థాయిన్+ఈ=స్థాయినీ.
అభిమానిన్+ఈ=అభిమానినీ.

షరా. తత్సమభాషలో ఇన్నంతములకుఁ బుంలింగంబునఁ జివరిన కారములోపించును నకారములోపింపఁజేసి గుణి మొదల గునవి ఇన్నంతములని చెప్పినచో నకారము లేకపోవుట చే ఇకారాంతముగానే తలఁతురని నకారముగూడఁ జూ పఁబడినది.

౮. 'తృ' వర్ణాంతములకు స్త్రీత్వవివక్షయందు తృవర్ణమునకు త్రీవర్ణమాదేశముగావచ్చును.

నేతృ—నేత్రీ; వక్తృ—వక్త్రీ; దాతృ—దాత్రీ.

కర్తృ-కర్త్రీ; భర్తృ-భర్త్రీ.

పరా. పితృ భ్రాతృశబ్దములకుఁ బైవిధి ప్రవర్తింపదు.
మాతృ, దుహితృ, యాతృ శబ్దములు స్త్రీలింగములగుట చే స్త్రీత్వవివక్షయే యక్కఱలేదు.

౯. సమాసాంతమగు 'పాద్' శబ్దమునకు స్త్రీత్వవివక్షయందు వికల్పముగా 'పద్' ఆదేశమువచ్చును.

ద్విపాద్—ద్విపదీ; ద్విపాద్.

పరా. పాదశబ్దమునకు సమాసాంతమందు దకారముమీఁది 'అ' కారమునకులోపమువచ్చును. (చూ. సమాసము)

౧౦. చర, శబ్దాంతములకు స్త్రీత్వవివక్షయందు రేఫమునకు 'ఈ' కారమందాదేశముగావచ్చును.

సహచర-సహచరీ; వనచర-వనచరీ.

కురుచర-కురుచరీ; వనేచర-వనేచరీ.

భిక్షాచర-భిక్షాచరీ; సేనాచర-సేనాచరీ.

ఆదాయచర-ఆదాయచరీ.

పరా. బహువ్రీహి సమాసమందురాదు (నగరీబహుకురుచరా) సహచరీ శబ్దమునకు రావచ్చును. (బహుసహచరీస్త్రీ)

౧౧. పరిమాణార్థమున ద్వయస, దఘ్న, మాత్రప్రత్యయములు వచ్చును.

| | | |
|---|---|---|
| ఊరుద్వయసము | జలము | [తొడలబంటినీరు] |
| ఊరుదఘ్నము | ,, | ,, |
| ఊరుమాత్రము | ,, | ,, |

వక్షోద్వయసము ,, [రొమ్ములబంటినీరు]
వక్షోదఘ్నము ,, ,,
వక్షోమాత్రము ,, ,,

౧౨. స్త్రీత్వవివక్షయందు ద్వయసాదులకు ఈకారమంతాదేశముగావచ్చును.

ఊరుద్వయసీ నదీ
ఊరుదఘ్నీ నదీ
ఊరుమాత్రీ నదీ

౧౩. సంఖ్యావాచకములకు అవయవార్థమందు 'తయ' ప్రత్యయమువచ్చును.

౧౪. ద్వి, త్రి, శబ్దములకు ద్వయ, త్రయ ఆదేశములు క్రమముగా వికల్పముగావచ్చును.

వికల్పపక్షమున తయప్రత్యయమేవచ్చును.

ద్వి+ద్వయము=ద్వితయము.
త్రి+త్రయము=త్రితయము.
పంచతయము.
షట్తయము.

౧౫. ద్వయ, త్రయ శబ్దములకును తయప్రత్యయాంతములకును స్త్రీత్వవివక్షయందు ఈకారమంతాదేశమగును.

ద్వయీ, త్రయీ, చతుష్టయీ, ద్వితయీ, పంచతయీ.

౧౬. అదంత సమాహార ద్విగువునకు స్త్రీత్వవివక్షయందు ఈకారమంతాదేశమగును.

సప్తద్వీపీ, చతుస్సముద్రీ మొ.

౭౭. త్రిలోకశబ్దమునకు ఈత్వమువికల్పము. త్రిలోకీ, త్రిలోకం త్రిఫలా త్రిసేనా శబ్దములకు ఈత్వమురాదు. అదంతము గనుక మొదటిసూత్రముచే ఆకారమందాదేశమగును. త్రిపథం, త్రిభువనం, పంచపాత్రం, చతుర్యుగం. ఈశబ్దములకు ఈత్వమును ఆత్వమునురాదు.

౭౮. ఆకారాంతస్త్రీలింగాంతమగు సమాహారద్విగువునకు ఈకారము వికల్పముగా నంతాదేశమగును.

పంచఖట్వీ-పంచఖట్వే.

వికల్పపక్షమున నపుంసకత్వము వచ్చును.

పంచఖట్వం.

౭౯. అపత్యాద్యర్థములందు పదముయొక్క ప్రథమాక్షరము మీఁది 'అ ఆ' లకు ఆకారమును, 'ఇ ఈ ఏ ఐ' లకు ఐకారము 'ఉ ఊ ఓ ఔ' లకు ఔకారమును ఋకారమునకు 'ఆర్' యును ఆదేశములగును.

అర్క-ఆర్క.

ఆలయ-ఆలయ.

ఇంద్ర-ఐంద్ర.

ఈశ్వర-ఐశ్వర.

ఉగ్ర-ఔగ్ర.

సూర-సౌర.

మేష-మైష.

ఓఘ-ఔఘ; సౌధ-సౌధ.

మైనాక-మైనాక.

షరా. ఋకారమునకుదాహరణము క్రిందిసూత్రములో జెప్పఁబడును. స్మార్త మొ.

౧౯. ఇకారాంతములకు అపత్యాద్యర్థములందు అకారమును 'తృ' వర్ణాంతములకు త్రవర్ణంబును ఉకారాంతములకు 'అవ' ప్రత్యయంబును అంతాదేశములగును.

శ్రుతి-శ్రౌత.

స్మృతి-స్మార్త.

దుహితృ-దౌహిత్ర.

పితృ-పైత్ర.

విష్ణు-వైష్ణవ.

షరా. పైసూత్రముచేఁ బ్రథమాక్షరాచ్చున కాదేశములు చెలియునది

భ్రాతృ శబ్దమునకు అపత్యార్థమందు 'వ్య' ప్రత్యయము వచ్చును.

భ్రాతృ-భ్రాతృవ్య.

౨౦. ఆ ఈ కారాంత స్త్రీలింగములకు అపత్యాద్యర్థములందు ఏయ ప్రత్యయమంతాదేశమగును.

సుపర్ణా-సౌపర్ణేయ.

కుంతీ-కౌంతేయ.

షరా. ౧౯వ సూత్రముచేఁబ్రథమాక్షరాచ్చున కాదేశము.

౨౧. అపత్యాద్యర్థంబులందలి పైరూపములకు స్త్రీత్వవివక్ష

౭౮. పైయర్థమందు సూర్యాదులు యథాప్రయుక్తంబుగా గ్రాహ్యంబులు.

సూర్య-సూర్యా (సంజ్ఞా లేక ఛాయాదేవి
సూరీ [కుంతీదేవి] [కుంతితో సూర్యుడు సంగమించెనని
భారతము.

ఇంద్ర-ఇంద్రాణీ.
వరుణ-వరుణానీ.
భవ-భవానీ.
శర్వ-శర్వాణీ.
రుద్ర-రుద్రాణీ.
మృడ-మృడానీ.
మాతుల-మాతులానీ-మాతులీ.
ఉపాధ్యాయ-ఉపాధ్యాయానీ, ఉపాధ్యాయీ.
ఆచార్య-ఆచార్యానీ.

౭౯. ఉపాధ్యాయీ, ఉపాధ్యాయాశబ్దములకు ఉపాధ్యాయురాలు అనియర్థము.
ఉపాధ్యాయానీ, ఉపాధ్యాయీశబ్దములకు ఉపాధ్యాయుని భార్య యనియేయర్థము.
ఆచార్యా శబ్దమునకు ఉపాధ్యాయురాలు అనియర్థము.
ఆచార్యానీ శబ్దమునకు ఉపాధ్యాయునిభార్య యని యర్థము.
హిమ-హిమానీ [గొప్పమంచు]
అరణ్య-అరణ్యానీ [గొప్పయడవి]

పాణిగృహీతీ [భార్య]
పాణిగృహీతా [పాణియందు గ్రహింపఁబడినది.]

౨౯. అంగ, గాత్ర, కంఠ, పుచ్ఛ, నాసికా, ఉదర, ఓష్ఠ, జంఘా, దంత, కర్ణ, శృంగశబ్దములకు బహువ్రీహిసమాసమందు స్త్రీత్వవివక్షయందు ఈకారము వికల్పముగా వచ్చును.

ఈత్వమురానప్పుడు అదంతమగుటచే ఆకారమువచ్చును.

చంపకనాసికీ-చంపకనాసికా
లతాంగీ-లతాంగా
కలకంఠీ-కలకంఠా. మొ.

౩౦. సంయోగము ఉపధగాలేని శరీరావయవవిశేషమంతమందుఁ గల బహువ్రీహికి స్త్రీత్వవివక్షయందు ఈకారము వికల్పముగా వచ్చును.

చంద్రముఖీ-చంద్రముఖా

సుగుల్ఫా } [సంయోగోపధములు గనుక ఈత్వమురాదు]
మృగనేత్రా }

౩౧. క్రోడాదులకును బహ్వచ్చులుగల శరీరావయవనామమందుఁగల బహువ్రీహికి ఈత్వమురాదు.

కల్యాణక్రోడా సుజఘనా స్త్రీ

౩౨. సహ, న, విద్యమాన. శబ్దములకుఁబరమైన శరీరావయవవిశేషములబహువ్రీహికని ఈత్వమురాదు.

సకేశా, విధవా, అకేశా, విద్యమాననాసికా

యందు ఈకారమంతాదేశమగును.

ఐంద్ర-ఐంద్రీ,
శాక్త-శాక్తీ.
వైష్ణవ-వైష్ణవీ
సౌపర్ణేయ-సౌపర్ణేయీ.
కౌంతేయ-కౌంతేయీ. మొ.

౨౨. ఊధశ్శబ్దాంతబహువ్రీహిలోనియు సంఖ్యావ్యయ వాచకములకుఁ బరమైనట్టియు ఊధస్ శబ్దమునకు ఊధ్నీ ఆదేశము వచ్చును.

కుండ+ఊధస్ (కుండ+ఊధ్నీ)=కుండోధ్నీ.
అతి+ఊధస్ అత్యూధ్నీ.
ద్వి+ఊధస్ ద్వ్యూధ్నీ.

౨౩. సంఖ్యాదియు దామశబ్దాంత మునగు బహువ్రీహియందు 'దామన్' రూపమునకు 'దామ్నీ' ఆదేశమువచ్చును.

ద్విదామన్-ద్విదామ్నీ.

౨౪. సంఖ్యాదియు వయోవాచకమును నగు హాయన శబ్దాంతమందుఁగలబహువ్రీహికి స్త్రీత్వవిశేషమందు ఈకారమంతాదేశముగావచ్చును.

ద్విహాయన-ద్విహాయనీ బాలా (ద్విహాయనిబాల)

౨౫. త్రి, చతుర్ శబ్దములకుఁ బరమైన హాయన శబ్దములోని 'న' వర్ణము 'ణ' వర్ణమగును.

త్రిహాయణీ-చతుర్హాయణీ.

౨౫. శతృప్రత్యయాంతములకు స్త్రీత్వవివక్షయందు అంత్య 'త' కారమునకు 'ంతీ' ఆదేశమువచ్చును.

భవత్-భవంతీ. (అగుచున్న)

కుర్వత్-కుర్వంతీ.

దీవ్యత్-దీవ్యంతీ.

౨౬. అక్తిన్నంతముల ఇకారమునకు వికల్పముగ దీర్ఘము వచ్చును.

రాత్రి-రాత్రీ } తెలుఁగులో సమాసమున నీభేదము కన
శకటి-శకటీ } నగును.
కేళి-కేళీ }

సూ. అక్తిన్నంతములనగా 'తి' వర్ణము ధివర్ణము ష్టివర్ణము లంతమందు లేనివి.

గతి-తివర్ణాంతము.

బుద్ధి-ధివర్ణాంతము.

ఇష్టి-ష్టివర్ణాంతము

౨౭. 'వానియాలు' యనునర్థమందు అదంత పుంలింగములకు ఈత్వమువచ్చును.

గోప-గోపీ (గోపునిభార్య)

నట-నటీ (నటునిభార్య)

సూ. పాలకశబ్దాంతమున కీత్వమురాదు.

గోపాలక-గోపాలికా.

౧, ౨ సూత్రములచే ఆత్వ ఇత్వములు వచ్చును.

౩౭. యకారోపధగాని జాతివాచకమునకు స్త్రీత్వవివక్ష యందు ఈకారమంత్యాదేశముగావచ్చును.

బ్రాహ్మణ-బ్రాహ్మణీ.

వృషల-వృషలీ.

షరా. వైశ్య అర్య క్షత్రియ శబ్దములు యకారోపధములు గనుక ఈత్వమురాదు. వైశ్యా.

అర్య క్షత్రియ శబ్దములకు విశేషముగలదు.

అర్యాణీ-అర్యా.

క్షత్రియాణీ-క్షత్రియా.

'వాసియాడుది' యనునర్థమందు ౨౭వ సూత్రముచే వైశ్యీ, అర్యీ, క్షత్రియీ అని ఈకారాంతములే యగును.

౩౮. జాతివాచకములగు శూద్ర, అజ, ఏడక, అశ్వ, చటక, మూషక, కోకిల శబ్దములకు ఈత్వమురాదు.

శూద్రా, అజా, ఏడకా, అశ్వా, చటకా, మూషకా, కోకిలా, మొ.

షరా. మహాశబ్దము పూర్వమందుగల శూద్రశబ్దమునకు ఈత్వమే వచ్చును.

మహాశూద్రీ.

౩౯ ప్రథమవయోవాచకములకు స్త్రీత్వవివక్షయందు ఈత్వము వచ్చును.

కుమార-కుమారీ.

తరుణ-తరుణీ.

షరా. ప్రథమ వయోవాచకములగు బాల, వత్స, హోఢ,

మంద, విలాత, శబ్దములకు ఈత్వమురాదు. అదంతము లగుటచే ఆత్వమగును.

బాలా, వత్సా, మందా, మేధా, విలాతా.

36. దృక్, దృశ్, అంతములకు స్త్రీత్వవివక్షయందు 'దృశీ' ఆదేశమువచ్చును.

ఈదృక్—ఈదృశ్—ఈదృశీ.

తాదృక్—తాదృశ్—తాదృశీ.

ఏతాదృక్—ఏతాదృశ్—ఏతాదృశీ.

మాదృక్—మాదృశ్—మాదృశీ.

త్వాదృక్—త్వాదృశ్—త్వాదృశీ.

భవాదృక్—భవాదృశ్—భవాదృశీ.

అమూదృక్—అమూదృశ్—అమూదృశీ.

అస్మాదృక్—అస్మాదృశ్—అస్మాదృశీ.

యుష్మాదృక్—యుష్మాదృశ్—యుష్మాదృశీ మొ.

37. 'కలవాఁడు' అనునర్థమందు 'మత్' ప్రత్యయమువచ్చును.

బుద్ధి+మత్=బుద్ధిమంతుఁడు; (బుద్ధిగలవాఁడు.)

38. అ, ఆ, వర్ణాంతశబ్దములకును మి, మీ, మూ, వర్ణాంతశబ్దములకును బరమైన మత్ప్రత్యయ మకారమునకు వకారమగును.

జ్ఞాన+మత్=జ్ఞానవంతుఁడు.

విద్యా+మత్=విద్యావంతుఁడు.

లక్ష్మీ+మత్=లక్ష్మీవంతుఁడు.

క్రిమి+మత్ =క్రిమివంతము.

చమూ+మత్ =చమూవంతుఁడు.

షరా. భూమి శబ్దమునకుఁ బరమైనయెడల రాదు.

భూమిమంతము.

౩౯. అ,ఆ, వర్ణములుపధగాఁగల పదములకును బరమైన మత్ప్రత్యయ 'మ' కారమునకు వకారమువచ్చును.

యశస్+మత్ =యశస్వంతుఁడు.

భాస్+మత్ =భాస్వంతుఁడు.

షరా. ఉపధయనఁగాఁ బదమునకుఁ జివరినుండి లెక్కించినపుడు రెండవవర్ణమగునది ఇచ్చట 'యశస్' అనుపదము లో 'శ' వర్ణముమీఁదనున్న 'అ' వర్ణము ఉపధ.

౪౦. స్త్రీలింగవివక్షయందుఁ బైవానిఅంత్య 'త' వర్ణమునకు 'ఈ' కారమువచ్చును.

బుద్ధిమత్-బుద్ధిమతీ.

జ్ఞానమత్-జ్ఞానవతీ.

యశస్మత్-యశస్వతీ.

స్త్రీప్రత్యయ ప్రకరణము

సమాప్తము.

—:o.—

## సమాసములు.

౧. అనేకపదంబుల నేకార్థబోధకముగాఁబలుకుట సమాసము.
  ౧. అవ్యయీభావము.
  ౨. తత్పురుషము.
  ౩. ద్వంద్వము.
  ౪. కర్మధారయము.
  ౫. బహువ్రీహి.
  ౬. ద్విగువు.

### అవ్యయీభావము.

౨. అవ్యయములకును సుబంతములకును జేయుసమాసము అవ్యయీభావము.

౩. అవ్యయీభావసమాసమందు దీర్ఘాంతశబ్దములు హ్రస్వములును నపుంసకసమంబులు నగును.

౪. అవ్యయీభావ సమాసమందవ్యయములు సుబంతములకు మొదటనిలుచును.

౫. సప్తమ్యర్థమున 'అధి' అవ్యయమువచ్చును.

| | | |
|---|---|---|
| వృక్షము | (అందు) | అధివృక్షము. |
| శిలా | ,, | అధిశిలము. |
| హరి | ,, | అధిహరి. |
| లక్ష్మీ | ,, | అధిలక్ష్మి. |

పితృ (అందు) అధిపితృ.

౬. సమీపార్థమందు 'ఉప' వచ్చును.

వనము (సమీపము) ఉపవనము మొ.

౭. అభావార్థమందు 'నిర్' వచ్చును.

అర్గళా (అభావము) నిరర్గళము.

౮. వీప్సార్థమందు 'ప్రతి' వచ్చును.

గృహము—ప్రతిగృహము.

౯. 'అతిక్రమింపక' అనునర్థమున 'యథా' వచ్చును.

యథావిధి—యథాశక్తి.

౧౦. సాకల్యార్థమందు 'స' వర్ణము వచ్చును.

సతృణము తినును [సకలము]

౧౧. లేశార్థమందు 'ప్రతి' శబ్దము సుబంతమునకుఁ బరముగా వచ్చును.

శాకప్రతి=శాకలేశము.

సూపప్రతి=సూపలేశము.

౧౨. ఆదిపర్యంతార్థములందుఁ బదాదిని 'ఆ' కారమగును.

ఆ బాల్యము—బాల్యము మొదలు.

ఆ చంద్రార్కము—చంద్రార్కులుండువఱకు.

షరా. పర్యంతార్థమున 'ఆ' కారము పదాదియందు వచ్చియు 'పర్యంత' 'అంత' శబ్దములుగూడ సత్కవి ప్రయోగంబులఁ జూపట్టెడిని.

ఆ భాష్యాంతము—ఆభాష్యపర్యంతము=భాష్యముయొక్క

చివరవఱకు.

౧౩. గిరి, నదీ, పౌర్ణమాసీ, ఆగ్రహాయణీ, శబ్దాంతములగు అవ్యయీభావములకు వికల్పముగా 'అ' కారమంతాదేశమగును.

ఉపగిరము—ఉపగిరి.

ఉపనదము—ఉపనది.

ఉపపౌర్ణమాసము—ఉపపౌర్ణమాసి.

ఉపాగ్రహాయణము—ఉపాగ్రహాయణి.

౧౪. షష్ఠ్యర్థక సుబంతములకును౦దు 'పారమధ్య' శబ్దములు వికల్పముగా 'ఏ' కారాంతములై ప్రయోగింపఁబడును.

పారేగంగము—గంగాపారము.

మధ్యేగంగము—గంగామధ్యము.

మధ్యేసభము—సభామధ్యము.

పారేసముద్రము—సముద్రపారము.

౧౫. ఏకారాంతములైన పారే, మధ్యే శబ్దములకుఁ బరమైన 'అ'కారములోపించును.

పారేఅర్ణవము—పారేర్ణవము—అర్ణవపారము,

మధ్యేఅధ్వము—మధ్యేధ్వము—అధ్వమధ్యము.

అవ్యయీభావము

సమాప్తము.

—:o:—

# తత్పురుషసమాసము.

౧. ద్వితీయాది సప్తమ్యంతవిభక్తుల యర్థముయొక్క సంబంధముగల పదములకూడిక తత్పురుషము.

కృష్ణాశ్రితుఁడు-కృష్ణునాశ్రయించినవాఁడు.

పితృసముఁడు-తండ్రితోసముఁడు.

భూతబలి-భూతములకొఱకుబలి.

చోరభయము-చోరునివలనభయము.

రాజభటుఁడు-రాజుయొక్క భటుఁడు.

ఈశ్వరాధీనుఁడు-ఈశ్వరునియందధీనుఁడు.

౨. తత్పురుషసమాసమందు 'సఖి' శబ్దముయొక్క 'ఇ' కారమునకు 'అ' కారమువచ్చును.

కృష్ణ+సఖి=కృష్ణసఖ=కృష్ణసఖుఁడు.

౩. సర్వ, సంఖ్యాత శబ్దంబులకును ఏకదేశవాచకములకును, అవ్యయములకును బరమైన 'అహన్' శబ్దమునకు 'అహ్న' ఆదేశమువచ్చును.

అర్థశబ్దముతప్ప మిగిలిన రేఫవర్ణములుగలిగిన ఏకదేశ పదములకును 'ప్రా' శబ్దమునకును బరమైన అహ్న ఆదేశములోని 'న' కారమునకు 'ణ' కారమువచ్చును.

సర్వ+అహన్=సర్వ+అహ్న-సర్వాహ్ణము.

సంఖ్యాత+అహన్=సంఖ్యాతాహ్నము.

పూర్వ+అహన్=పూర్వాహ్ణము.

అపర + అహన్ = అపరాహ్ణము.
మధ్య + అహన్ = మధ్యాహ్నము.
ఉత్తర + అహన్ = ఉత్తరాహ్ణము.
సాయ + అహన్ = సాయాహ్నము.
అర్ధ + అహన్ = అర్ధాహ్నము.
పర + అహన్ = పరాహ్ణము.
ప్రి + అహన్ = ప్రాహ్ణము.

వరా. ఏకదేశమనఁగా 'భాగము' అనియర్థము.
మధ్యాహ్నము, పూర్వాహ్ణము, అనునపుడు మధ్య పూర్వ శబ్దములు దినముయొక్క కొంతభాగమును దెలుపును.
పూర్వ, అపర, అధర, ఉత్తర, పర, మధ్య, సాయ, అర్ధ, మొ. ఏకదేశపదములు.

న. అహన్, సర్వ, సంఖ్యాత, పుణ్యశబ్దములకును సంఖ్యావాచకములకును, అవ్యయములకును ఏకదేశవాచకములకును బరమైన రాత్రి శబ్దముయొక్క 'ఇ' కారమునకు అ కారమువచ్చును.'

అహన్ + రాత్రి = అహోరాత్రము.
సర్వ + రాత్రి = సర్వరాత్రము.
సంఖ్యాత + రాత్రి = సంఖ్యాతరాత్రము.
పుణ్య + రాత్రి = పుణ్యరాత్రము.
ద్వి + రాత్రి = ద్విరాత్రము.
త్రి + రాత్రి = త్రిరాత్రము.



అతి+రాత్రి=అతిరాత్రము.
ప్రతి+రాత్రి=ప్రతిరాత్రము.
పూర్వ+రాత్రి=పూర్వరాత్రము.
మధ్య+రాత్రి=మధ్యరాత్రము.
అర్థ+రాత్రి=అర్థరాత్రము.
పర+రాత్రి=పరరాత్రము.

౫. ముఖ్యార్థమును దెలుపు 'ఉరస్' శబ్దమునకు 'ఉరస' ఆదేశము వచ్చును.

అశ్వ+ఉరస్=అశ్వోరసము (ముఖ్యమైనగుఱ్ఱము)
పురుష+ఉరస్=పురుషోరసుఁడు. (ముఖ్యపురుషుఁడు)

౬. పూర్వపదము బహువచనంబైనయెడల ఛాయాశబ్దము నపుంసకమగును.

వృక్ష+ఛాయా=వృక్షచ్ఛాయము (చెట్లనీడ)

౭. రాజపర్యాయ శబ్దములకును రక్షఃపిశాచవాచక పదములకును బరమైన 'సభా' పదము నపుంసకమగును.

ఇనసభా-ఇనసభము.
ఈశ్వరసభా-ఈశ్వరసభము.
ప్రభుసభా-ప్రభుసభము.
రాక్షససభా-రాక్షససభము.
పిశాచసభా-పిశాచసభము.
రక్షస్ సభా-రక్షస్సభము.

పరా. రాజపర్యాయమని చెప్పుటచే 'రాజసభ' అనియేయగును.

౮. సంఘాతార్థమందున్న సభాశబ్దము నపుంసకమగును.

స్త్రీసభా+స్త్రీసభము [స్త్రీసంఘాతము]

౯. షష్ఠీతత్పురుష సమాసమందు సేనా, సురా, ఛాయా, శాలా, నిశా, శబ్దములు వికల్పముగా నపుంసకములగును.

శత్రుసేన-శత్రుసేనము.

కుడ్యచ్ఛాయ-కుడ్యచ్ఛాయము.

పాఠశాల-పాఠశాలము.

శ్వనిశ-శ్వనిశము.

౧౦. నిషేధార్థకమైన 'న' కారమునకు హలాదిశబ్దము పరమైనపుడు 'అ' కారమును అజాదిశబ్దము పరమైనపుడు 'అన్' ఆదేశమును బహుళముగా వచ్చును.

న+బ్రాహ్మణుఁడు=అబ్రాహ్మణుఁడు.

న+అశ్వము=అనశ్వము.

బహుళగ్రహణముచేఁగొన్నింటియందు వికల్పము.

న+ఏకము=అనేకము; నైకము.

న+ఏకధా=అనేకధా; నైకధా.

తత్పురుషసమాసము

సమాప్తము.

—.o:—

# కర్మధారయము.

౧. విశేషణవిశేష్య భావాపన్నంబు కర్మధారయంబు.

౨. కర్మధారయ సమాసాంతర్వర్తియు, సంఖ్యావాచకమునకు, అవ్యయమునకుఁ బరమైనట్టియు 'అహన్' శబ్దము యొక్క సకారమునకు లోపమువచ్చును.

ఉత్తమ+అహన్=ఉత్తమాహము

శుభ+అహన్=శుభాహము.

పుణ్య+అహన్=పుణ్యాహము.

సుదిన+అహన్=సుదినాహము.

ద్వి+అహన్=ద్వ్యహము.

త్రి+అహన్=త్ర్యహము.

సప్త+అహన్=సప్తాహము.

ఏక+అహన్=ఏకాహము.

దశ+అహన్=దశాహము.

ప్రతి+అహన్=ప్రత్యహము.

అను+అహన్=అన్వహము.

వి.గా. ద్వ్యహము మొదలగునవి సంఖ్యావాచకములకుఁ బరమగుటచే ద్విగుసమాసములైనను ఏకసూత్రము చేయఁబడినది.

౩. 'మహత్' శబ్దమునకుఁ గర్మధారయ సమాసమందు 'త్' కారము లోపించి పూర్వాచ్చునకు దీర్ఘమువచ్చును.

మహాత్ + దేవుఁడు=మహాదేవుఁడు.

౪. నిందార్థమందు 'కిం' పదము వచ్చును.

కింరాజు=దుష్టరాజు.

కింసఖుఁడు=దుష్టస్నేహితుఁడు.

౫. మయూరవ్యంసకాదులు యథాప్రయుక్తంబుగ గ్రాహ్యంబులు.

మయూరవ్యంసకము—[మదించిన నెమలి]

ఉదక్+అవాక్=ఉచ్చావచము [అనేక భేదములు]

నిశ్చితం+ప్రచితం=నిశ్చప్రచము.

నకుతోభయః=అకుతోభయుఁడు [దేనివలనఁగాని భయము లేనివాఁడు]

నకించన=అకించనుఁడు [కొంచెమును లేనివాఁడు అనఁగా దరిద్రుఁడు]

అన్యోరాజా=రాజాంతరము (మరియొక రాజు)

చిత్ [ఏవ]=చిన్మాత్రం [చిత్తే]

౬. పోటా, యువతి, స్తోక, కతిపయ, గృష్టి, ధేను, వశా, వేహత్, బష్కయణీ, ప్రవక్తృ, శ్రోత్రియ, అధ్యాపక ధూర్తాది విశేషణ వాచకములు సమాసమందు విశేష్యమునకుఁ బరముగాఁ బ్రయుక్తంబులగును.

ఇభపోటా

ఇభయువతి (ఆఁడేనుఁగు.)

అగ్నిస్తోకము (కొంచెమునిప్పు.)

మాసకతిపయము (కొన్నిమాసములు)
గోగృష్టి (ఎప్పుడో యొకమారు ఈనుఆవు)
గోధేనువు [లేఁగటియావు]
గోవశా (గొడ్డుమోతుఆవు)
గోవేహత్ [ఈఁచుకొనిపోయినఆవు]
కఠప్రవక్త [ప్రవక్తయగు కఠుఁడు]
కఠశ్రోత్రియుఁడు [శ్రోత్రియుఁడగు కఠుఁడు]
కఠాధ్యాపకుఁడు [అధ్యాపకుఁడగు కఠుఁడు]

౭. మతల్లికా, మచర్చికా, ప్రకాండ, ఉద్ఘ, తల్లజ, వరేణ్య, వర్య, విశేషణంబులు విశేష్యమునకుఁ బరమందుఁ బ్రయోగింపఁబడును.

గోమతల్లికా } మంచియావు.
గోమచర్చికా }

రాజప్రకాండము (ప్రకాండశబ్దము నిత్యనపుంసకము) తెలుఁగులోఁ బుంలింగముగాఁగూడఁ జూపఁబడెని.

గవోద్ఘము (గో+ఉద్ఘము చూ, అచ్సంధి ౧౦ సూ)
కవితల్లజుఁడు-కవివరేణ్యులు-కవివర్యులు.

పరి మతల్లికాదులు శ్రేష్ఠార్థవాచకములు.
౮. శ్రేష్ఠ, ఉత్తమ, వర, ఆదిశబ్దములువిశేష్యములకుఁ బూ

ర్వమందును బరమందును వచ్చును.

పండితశ్రేష్ఠుఁడు——శ్రేష్ఠపండితుఁడు.

ఉత్తమపండితుఁడు——పండితోత్తముఁడు.

వరకవి——కవివరుఁడు.

కర్మధారయము

సమాప్తము.

——:o:——

## బహువ్రీహిసమాసము.

౧. అన్యపదార్థప్రధానము బహువ్రీహి.

౨. గ్రహణవిషయక సరూపపదంబులకును ప్రహరణ విషయక సరూప పదంబులకును కర్మవ్యతీహారమునందు కలహార్థము తోఁచుచుండఁగా పూర్వపద దీర్ఘంబును ద్వితీయ పదాంతమునకు 'ఇ' కారాదేశంబునువచ్చును.

కేశ+కేశ=కేశాకేశి.

కచ+కచ=కచాకచి.

హస్త+హస్త=హస్తాహస్తి.

బాహు+బాహు=బాహుబాహి.

కర+కర=కరాకరి.

ముష్టి+ముష్టి=ముష్టీముష్టి. (ముష్టాముష్టియనియుం బ్రయోగంబుగలదు.)

దండ+దండ=దండాదండి.

వరా. గ్రహణమనఁగాఁ బట్టుకొనుట పట్టుకొనుటకు విషయములు కేశములు. సరూపపదములు అనఁగా సమానరూపముగల పదములు అనఁగా రెండును ఒక్కవిధమేయైన పదములు కర్మవ్యతీహారము అనఁగాఁగర్మయొక్కమార్పు కలహము అనఁగా పోరాటము.

కేశాకేశి=ఒకరినెంౘ్రుకలొకరు పట్టుకొని పోరాడుట.

పరిహారణమనఁగాఁ గొట్టుకొనుట కొట్టుటకు విషయము ద్వంద్వము మిగిలినది సమానము.

3. ఉకారాంతశబ్దమునకుఁ బై విషయమందుఁ బరమైన ద్వితీయ పదంబునకు 'అవ' అంతాదేశమగును.

బాహు+బాహు=బాహూబాహవి.

రజ్జు+రజ్జు=రజ్జూరజ్జవి.

4. బహువ్రీహియందు 'సహ' శబ్దమునకు 'స' వర్ణము వికల్పము గావచ్చును.

సహపుత్రుఁడై రాజువచ్చెను.

సపుత్రుఁడై ,,

సహబంధుమిత్రుఁడై ,,

సబంధుమిత్రుఁడై ,,

5. అవ్యయములకును ఆసన్న, అదూర, అధిక శబ్దములకును. బరమైన దశాదులు యథాప్రయుక్తంబుగ గ్రాహ్యంబులు.

దశాదులు:-దశ, వింశతి, త్రింశత్, చత్వారింశత్, పంచాశత్, షష్టి, సప్తతి, అశీతి, నవతి, శము.

| | | |
|---|---|---|
| ఉపదశము | (దగ్గరదగ్గర పది లేక రమారమి పది.) | |
| ఆసన్నవింశము | ,, | ఇరువది |
| అదూరత్రింశము | ,, | ముప్పది |
| అధికచత్వారింశము | ,, | నలువదికిఁబైని |
| ఆసన్నపంచాశము | ,, | ఏఁబదికిదగ్గఱ |
| ఆసన్నషష్టము | ,, | అఱువదికిదగ్గర |

| | | |
|---|---|---|
| ఆసన్నషష్టము | దగ్గరదగ్గర | అఱువది. |
| ఆసన్నసప్తము | ,, | డెబ్బది. |
| ఆసన్నాశము | ,, | ఎనుబది. |
| ఆసన్ననవము | ,, | తొంబది. |

౬. ఏకాదిసంఖ్యావాచకములకుఁ బరమైన 'ద్వి' మొదలగు శబ్దములు యథాప్రయుక్తంబుగ గ్రాహ్యంబులు.

ఏక+ద్వి=ఏకద్వము [ఒకటి రెండు]
ద్వి+త్రి=ద్విత్రము [రెండుమూఁడు]
త్రి+చతుస్=త్రిచతురము [మూఁడునాలుఁగు]
చతుస్+పంచ=చతుష్పంచము (నాలుఁగైదు)
పంచ+షట్=పంచషము [ఐదారు]
షట్+సప్త=షట్సప్తము (ఆఱేఁడు)
సప్త+అష్ట=సప్తాష్టము [ఏఁడెనిమిది]
అష్ట+నవ= అష్టనవము (ఎనిమిదితొమ్మిది)

౭. దశపదము పరమైనయెడల ఏకాదులు యథాప్రయుక్తంబుగ గ్రాహ్యంబులు.

ఏక+దశ=ఏకాదశము.
ద్వి+దశ=ద్వాదశము.
త్రి+దశ=త్రయోదశము.
చతుస్+దశ=చతుర్దశము.
పంచ+దశ=పంచదశము.
షట్+దశ=షోడశము.

సప్త+దశ=సప్తదశము.
అష్ట+దశ=అష్టాదశము.
[నవ+దశ] ఏకాన్నవింశతి; ఏకాద్నవింశతి; ఏకోనవింశతి

౮. బహువ్రీహి సమాసమందు సక్థి, అక్షి, శబ్దను లకుఁబున్న పుంసక లింగములందు అకారమంతాదేశమగును స్త్రీత్వ వివక్షయందు దీర్ఘమువచ్చును.

దీర్ఘ+సక్థి=దీర్ఘసక్థ=దీర్ఘసక్థుఁడు.
జలజ+అక్షి=జలజాక్షి=జలజాక్షుఁడు.

దీర్ఘసక్థీ (స్త్రీ)
జలజాక్షీ (స్త్రీ)

౯. జాయాశబ్దాంత బహువ్రీహిలోని 'యా' వర్ణమునకు 'ని' వర్ణమువచ్చును.

లక్ష్మీ+జాయా-లక్ష్మీజాని (లక్ష్మిభార్యగాఁగలవాఁడు.)
భూమీ+జాయా=భూమీజాని.
సీతా+జాయా=సీతాజాని.
యువతి+జాయా=యువజాని.

షరా. యువతి శబ్దమందు 'తి' వర్ణములోపించును.

౧౦. ఉత్, పూతి, సు, సురభి శబ్దములకుఁ బరమైన గంధ శబ్ద అంత్య అకారమునకు ఇకారమువచ్చును.

ఉద్గంధ-ఉద్గంధి (పెద్దపరిమళముగలది.)
పూతిగంధ-పూతిగంధి (దుర్గంధముగలది.)
సుగంధ-సుగంధి (మంచిపరిమళముగలది.)

సురభిగంధ-సురభిగంధి ,,

౧౧. ఉపమానవాచకమునకుఁ బరమైన గంధశబ్ద అంత్య అకారమునకును ఇత్వమువచ్చును.

పద్మగంధి (పద్మముయొక్క పరిమళమువంటి పరిమళము గలది)

౧౨. దారుపద్దమునకు విశేషణంబగు అంగుళిశబ్దాంత బహువ్రీహికి 'అ' కారమంతాదేశమగును.

పంచ+అంగుళి=పంచాంగుళము దారువు.

షరా. దారుభిన్న పదమునకు విశేషణంబైనపుడు ఇకారాంతముగనే యుండును.

హస్తము-పంచాగుళి మొ.

౧౩. సంఖ్యావాచకములకును 'సు' అనువర్ణమునకును హస్త్యాదిభిన్నములకును బరమైన పాదశబ్దముయొక్క అంత్య అకరము లోపించును.

ద్విపాద-ద్విపాత్.
సుపాద-సుపాత్.

షరా. హస్త్యాదులకుఁ బరమైనపుడు రాదు.

హస్తిపాదుఁడు-కుసూలపాదుఁడు మొ.

౧౪. చెప్పఁబడిన స్థలంబులందుఁగాక భిన్నస్థలంబులందు బహువ్రీహియందు 'క' ప్రత్యయము వికల్పముగావచ్చును.

మహాయశస్-క-మహాయశస్కుఁడు-మహాయశుఁడు మొ.

౧౫. 'క' ప్రత్యయము పరమైనపుడు దీర్ఘాంతశబ్దమునకు

హ్రస్వమువచ్చును. ఇదివికల్పము.

బహుమాలా+క=బహుమాలకుఁడు.

బహుమాలాకుఁడు.

షరా. 'క' ప్రత్యయ వికల్పపక్షమందు పదాంతదీర్ఘమునకు హ్రాస్వమువచ్చును.

బహుమాలా-బహుమాలుఁడు మొ.

## బహువ్రీహిసమాసము

సమాప్తము.

—:o:—

# ద్వంద్వసమాసము.

౧. ఇతరేతర యోగ సమాహారార్థములందు ద్వంద్వమువచ్చును.

హరి+హర=హరిహరులు.

సంజ్ఞా+పరిభాషా=సంజ్ఞాపరిభాషము.

షరా. సమాహారార్థమందు దీర్ఘాంతములకు హ్రస్వము వచ్చును నపుంసకమగును.

౨. ద్వంద్వసమాసమందు ఇకార ఉకారాంత శబ్దములు ముందుఁ బ్రయోగింపఁబడును.

హరి+హర=హరిహరులు.

హర+హరి=హరిహరులు.

శంభు+బ్రహ్మ=శంభుబ్రహ్మలు.

బ్రహ్మ+శంభు=శంభుబ్రహ్మలు.

౩. అజాది అదంత శబ్దములయొక్క ద్వంద్వమందు అజాది శబ్దములు ముందుఁ బ్రయోగింపఁబడును.

ఈశ+కృష్ణ=ఈశకృష్ణులు.

కృష్ణ+ఈశ=ఈశకృష్ణులు.

౪. అల్పాచ్చులు గలదానిని ముందుఁబ్రయోగింపవలెను.

శివ+కేశవ=శివకేశవులు.

కేశవ+శివ=శివకేశవులు.

నల+దమయంతి=నలదమయంతులు.

దమయంతీ+నల=నలదమయంతులు.

౫. సమానాచ్చులు గలవానిలో లఘ్వక్షరము గలదానిని ముందుఁ బ్రయోగింపవలెను.

కుశ+కాశ=కుశకాశములు.

కాశ+కుశ=కుశకాశములు.

వరా. ఇచ్చట, కుశ, కాశ శబ్దములలో రెండచ్చులున్నవి కాశ శబ్దములో మొదటిది గురువుకాఁబట్టి ముందుఁ బ్రయోగింపఁబడక లఘ్వక్షరములుగల కుశ శబ్దమే ముందుఁ బ్రయోగింపఁబడును.

వరా. ౨, ౩, ౪, ౫ సూత్రములకు అభ్యర్హితవివక్షయందైనను క్రమవివక్షయందును బాధ్యత్వముగన్పించుచున్నది.
సూర్యేందుసంగము; పద్మసంభవవైకుంఠ భర్గసభలు.

౬. కులవిశేషవాచకములు యథాక్రమముగాఁ బ్రయోగింపఁబడును.

బ్రహ్మణక్షత్రియవిట్శూద్రులు.

వరా. ఇచ్చట విట్, శూద్రశబ్దములు అల్పాచ్చులు గలవైనను ముందుఁబ్రయోగింపఁబడలేదు.

౭. భ్రాతృవిశేష బోధక పదములలో జ్యేష్ఠవాచకము ముందుఁ బ్రయోగింపఁబడును.

యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులు.

వరా. ఇచ్చట యుధిష్ఠిర శబ్దములో నాల్గచ్చులుగలవు భీమ శబ్దములో రెండచ్చులుగలవు కాన ౪వ సూత్రముచే భీమశబ్దము ముందుఁ బ్రయోగింపవలసి యుండఁగా ని

సూత్రము ప్రారంభింపఁబడినది.

౮. ప్రాణ్యంగములకును సేనాంగములకును ఏకవచనము నిత్యముగావచ్చును.

పాణిపాదము.

రథికాశ్వారోహము.

౯. ప్రకృతిచే విరోధముగల జంతువాచకములకు ఏకవచనము నిత్యముగానగును.

గో+వ్యాఘ్రము =గోవ్యాఘ్రము.

సర్పనకులము.

కాకోలూకము.

౧౦. గవాశ్వప్రభృతులకును ఏకవచనము నిత్యముగానగును.

గో+అశ్వ=గవాశ్వము.

పుత్రపౌత్రము.

దాసీదాసము.

మూత్రపురీషము.

మాంసశోణితము.

౧౧. బహుత్వబోధకములైన వృక్షవిశేషవాచకంబులకు, తృణవిశేషవాచకములకు, మృగవిశేషవాచకములకు, ధాన్యవిశేషవాచకములకు, పశువిశేషవాచకములకు, పక్షివిశేషవాచకములకును, ఫలవిశేషవాచకములకు, ఏకవచనము వికల్పముగావచ్చును.

ప్లక్షన్యగ్రోధము-ప్లక్షన్యగ్రోధములు (వృక్షవిశేషములు)

కుశకాశమ్ము–కుశకాశములు [తృణవిశేషము]
రురుపృషతము–రురుపృషతములు (మృగవిశేషము)
వ్రీహియవము–వ్రీహియవములు [ధాన్యవిశేషములు]
గోమహిషము–గోమహిషములు [పశువిశేషములు]
శుకపికము–శుకపికములు (పక్షివిశేషములు)
బదరామలకము–బదరామలకములు (ఫలవిశేషములు)

షరా. ఇందు మృగములనియుఁ బశువులనియు రెండుగాఁ జెప్పఁబడినవి మృగములనఁగా అరణ్యమృగములు పశువులనఁగాఁ గ్రామములలోఁ బెంపఁబడు మృగములు.

౧౨. పరస్పర విరుద్ధములగు పదముల కేకవచనము వికల్పముగా వచ్చును.

శీతోష్ణము–శీతోష్ణములు.
సుఖదుఃఖము–సుఖదుఃఖములు.
కామవైరాగ్యము–కామవైరాగ్యములు.

షరా. పరస్పర విరుద్ధంబులనఁగా నొక్కచోట రెండునుగలిసి యుండుట సంభవింపనిపదార్థములు.

శీతము, ఉష్ణము ఏకత్రనుండుట పొడమదు.

౧౩. ద్వంద్వసమాసాంతర్గత ఋకారాంతపదము ఆకారాంతమగును.

హోతృ+పోతృ=హోతాపోతృలు.
మాతృ+పితృ=మాతాపితృలు.
పితృ+పుత్ర=పితాపుత్రులు.

మాతృ+పుత్ర=మాతాపుత్రులు.

౧౪. సుప్రసిద్ధసాహచర్యముగల దేవతావాచకములయొక్క ద్వంద్వమందు ప్రథమపదంబునకు ఆకార మంతాదేశ మగును.

సూర్య+చంద్రమసుఁడు=సూర్యాచంద్రమసులు.
మిత్ర+వరుణుఁడు=మిత్రావరుణులు.

వా. వాయుశబ్దప్రయోగమందు ఆకారమురాదు.
అగ్నివాయువులు-వాయ్వగ్నులు.
సుప్రసిద్ధ సాహచర్యమని చెప్పుటచే బ్రహ్మప్రజాపతులు అన్నప్పుడు దీర్ఘమురాదు వారికి సుప్రసిద్ధసాహచర్యము లేదు.

౧౫. అగ్నిపదమునకు సోమవరుణ శబ్దములు పరమైన దీర్ఘము వచ్చును. సోమపదములోని సకారమునకు షకారము వచ్చును.

అగ్నీషోములు-అగ్నీవరుణులు.

౧౬. 'దివ్' శబ్దమునకు దేవతావాచకము పరమైనపుడు 'ద్యావా' ఆదేశమువచ్చును.

ద్యావాభూములు.

ద్యావాక్షమలు.

వా. ఇచ్చటఁగూడ సుప్రసిద్ధసాహచర్యముగల దేవతావాచకమేపరముగానుండవలెను.

౧౭. 'దివ్' శబ్దమునకు 'పృథివీ' శబ్దము పరమైనపుడు 'దివస్'

ఆదేశమువచ్చును. ఇదివికల్పము.

దివస్పృథువులు.

ద్యావాపృథువులు.

షరా. వికల్పపక్షమందుఁ బైసూత్రముచే 'ద్యావా' ఆదేశం బగును.

౧౮. 'ఉషస్' శబ్దమునకు దేవతావాచకము పరమైన 'ఉషాసా' ఆదేశమువచ్చును.

ఉషాసా సూర్యులు.

౧౯. చ్, జ్, ద్, ష్, హ్ వర్ణాంతద్వంద్వములకు అకారమం తాదేశమగును.

వాక్+త్వచ్=వాక్త్వచము.

త్వక్+స్రజ్=త్వక్స్రజము.

శమీ+దృషద్=శమీదృషదము.

వాక్+త్విష్=వాక్త్విషము.

ఛత్రి+ఉపానహ్=ఛత్త్రోపానహము

షరా. ద్వివిధద్వంద్వములలో నేదిచెప్పినను జెప్పవచ్చును. భేదమేమనిన ఇతరేతర యోగమైనయెడల బహువచ నాంతముగా నుండును సమాహారమైనయెడల నపుంస కంబును ఏకవచనంబును అగును.

ద్వంద్వసమాసము

సమాప్తము.

——:o:——

## ద్విగుసమాసము.

౧. సంఖ్యావాచకముముందుగలది ద్విగువు.
ద్విశాస్త్రి [రెండుశాస్త్రములసమూహము]
త్రిపుటీ; చతుస్సముద్రీ; పంచనదీ; షడ్రసీ; సప్తద్వీపీ;
శతాబ్దీ;

షరా. ద్విశాస్త్రి మొదలగుశబ్దములకు ఈత్వమువచ్చుటకు స్త్రీ ప్రత్యయప్రకరణము ౧౬వ సూత్రముచూచునది.
ద్వ్యహము, ద్విరాత్రము మొదలగుపదములు ద్విగు సమాసంబులైనను ఈత్వమురాలేదు వానినిఁ గర్మధారయ తత్పురుషములందు వ్రాసితిని.

౨. ద్విశబ్దమునకు దశ, వింశతి, త్రింశత్ శబ్దములు పరమైన ఆకారమంతాదేశమగును.

ద్వి+దశ=ద్వాదశ.
ద్వి+వింశతి=ద్వావింశతి.
ద్వి+త్రింశత్=ద్వాత్రింశత్.

3. ద్వి శబ్దమునకు చత్వారింశత్, పంచాశత్, షష్టి, సప్తతి నవతి శబ్దములు పరమైన వికల్పముగా ఆకారమంతా దేశమగును.

ద్వి+చత్వారింశత్=ద్వాచత్వారింశత్-ద్విచత్వారింశత్.
ద్వి+పంచాశత్=ద్వాపంచాశత్-ద్విపంచాశత్.
ద్వి+షష్టి=ద్వాషష్టి-ద్విషష్టి.

ద్వి+సప్తతి=ద్వాసప్తతి-ద్విసప్తతి.

ద్వి+నవతి-ద్వానవతి-ద్వినవతి.

షరా. అశీతి శబ్ద ముపరమైన ద్వి+అశీతి=ద్వ్యశీతి

ద్విగుసమాసము

సమాప్తము.

——:o:——

## ఏకశేషసమాసము.

౧. లింగమాత్రవైరూప్యముగల శబ్దములలో శబ్దములోపించును.

హంసీ+హంస=హంసలు.

షరా. హంసీ శబ్దమునకు స్త్రీలింగ బోధకమైన భేదము.

౨. స్వస్రాదులు యథాప్రయుక్తంబుగ గ్రాహ్య

స్వసృ+భ్రాతృ=భ్రాతలు.

దుహితృ+పుత్ర=పుత్రులు.

మాతృ+పితృ=పితలు; మాతాపితలు.

శ్వశ్రూ+శ్వశుర=శ్వశురులు; శ్వశ్రూశ్వశురు

షరా. ఇవిస్వస్రాదులు.

ఏకశేషసమాసము

సమాప్తము.

——:o:——

## సమాసాంతము.

౧. సమాసాంతమందున్న అప్, పథి, శబ్దములు అకారాంతంబులగును.

విమల+అప్=విమలాప (ము) సరస్సు.

రమ్య+పథి=రమ్యపథ (ము) దేశము.

౨. సమాసాంతమందున్న ధూర్, పూర్ శబ్దములకు క్రమముగా ధురా, పుర ఆదేశములువచ్చును.

రాజ+ధూర్=రాజధురా.

విష్ణు+పూర్=విష్ణుపురము.

౩. కృష్ణ, ఉదక్, పాండు, సంఖ్యావాచకములకుఁ బరమైన భూమిశబ్దమునకు అకారమంతాదేశమగును.

కృష్ణ+భూమి=కృష్ణభూమము.

ఉదక్+భూమి=ఉదగ్భూమము.

పాండు+భూమి=పాండుభూమము.

ద్వి+భూమి=ద్విభూమము [ప్రాసాదము.]

౪. సంఖ్యావాచకమునకుఁ బరమైన గోదావరీ, నదీ, శబ్దములకు 'అ' కారమంతాదేశమగును.

సప్త+గోదావరీ=సప్తగోదావరము.

పంచ+నదీ=పంచనదము.

౫. బహువ్రీహి సమాసమందు నాభి శబ్దమునకు అకారమంతాదేశమగును.

పద్మ నాభి పద్మనాభ[భు]ఁడు

౬. అచతురాదులు యథాప్రయుక్తంబుగ గ్రాహ్యంబులు.

న చతుస్=అచతురము. [నాలుఁగులేనిది]
వి చతుస్=విచతురము. ,,
సు చతుస్=సుచతురము. [మంచివినాలుఁగుగలది]
త్రి చతుస్=త్రిచతురము [మూఁడునాలుఁగు]
ఉప చతుస్=ఉపచతురము (రమారమినాలుఁగుగలది)
స్త్రీ పుమ్=స్త్రీపుంసము (స్త్రీపురుషులు)
ధేను అనడుహ్=ధేన్వనడుహము (ఆవుఎద్దులు)
వాక్ మనస్=వాఙ్మనసములు [మాటమనస్సులు]
అక్షి భ్రూ=అక్షిభ్రువము (కన్నులుకనుబొమ్మలు)
నక్తం దివా=నక్తందివము [రేయుంబవలు]
రాత్రి దివా=రాత్రిందివము ,,
అహస్ దివా=అహర్దివము (ప్రతిదినము)
స రజస్=సరజసము [సకలము]
పురుష ఆయుస్=పురుషాయుషము [పురుషునివయస్సు]
ఋక్ యజుస్=ఋగ్యజుషము (ఋగ్యజుర్వేదములు)
జాత ఉక్షన్=జాతోక్షము (కోడెదూడ)
మహా ఉక్షన్=మహోక్షము [పెద్దయెద్దు]
వృద్ధ ఉక్షన్=వృద్ధోక్షము (ముసలియెద్దు)

౭. అవ, సం, అంధ శబ్దములకుఁ బరమైన తమస్ శబ్దము అకారాంతమగును.

అవ తమస్=అవతమసము.

సం తమస్=సంతమసము.

అంధతమస్=అంధతమసము.

౮. అను, అవ, తప్త శబ్దములకుఁ బరమైన రహస్ శబ్దము అకారాంతమగును.

అను రహస్=అనురహసము.

అవ రహస్=అవరహసము.

తప్తరహస్=తప్తరహసము.

౯. దీర్ఘత్వమందు 'అనుగవం' అని నిపతింపఁబడును.

అనుగవము యానము (దీర్ఘప్రయాణము)

౧౦. బ్రహ్మ, హస్తి, పల్య, రాజ శబ్దములకుఁబరమైన 'వర్చస్' శబ్దము అకారాంతమగును.

బ్రహ్మవర్చస్=బ్రహ్మవర్చసము.
హస్తివర్చస్=హస్తివర్చసము.
పల్యవర్చస్=పల్యవర్చసము.
రాజవర్చస్=రాజవర్చసము.

సమాసాంతప్రకరణము

సమాప్తము.

——:o:——

## అలుక్సమాసము.

౧. ఆత్మశబ్దమునకు పూరణప్రత్యయాంతము పరమైనపుడు 'నా' వర్ణము అంతమందునగును.

పూరణ ప్రత్యయాంతములు ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ, సప్తమ, అష్టమ, నవమ. దశమ, మొదలగునవి.

ఆత్మ+ద్వితీయుఁడు=ఆత్మనాద్వితీయుఁడు మొ.

[తనతోరెండవవాఁడు]

౨. పుంసానుజ జనుషాంధ శబ్దములు నిపతింపఁబడును

పుంసానుజుఁడు=ఎవనిఅగ్రజుఁడుపురుషుడోవాఁడు.

జనుషాంధుఁడు=పుట్టుగ్రుడ్డువు.

3. శయ, వాస, వాసి శబ్దములు పరమైనపుడు అకారాంత శబ్దముల సప్తమికి లోపము వికల్పముగానగును.

గగన+శయము=గగనశయము; గగనేశయము.

గ్రామ+వాసము=గ్రామవాసము; గ్రామేవాసము.

గ్రామ+వాసి=గ్రామవాసి; గ్రామేవాసి.

షరా. కాలశబ్దమునకుఁ బరమైనచో లోపము నిత్యము.

కాలవాసము

౪. షష్ఠీవిభక్తికి పుత్రశబ్దము పరమైనపుడు నిందార్థమందు లోపము వికల్పము.

దాస్యాఃపుత్రుఁడు; దాసీపుత్రుఁడు.

౫. ఈక్రింది శబ్దములు యథాప్రయుక్తంబుగ గ్రాహ్యంబులు.

**ఆముష్యాయణుఁడు** [ఇతనిసంబంధమైనది]

దేవానాంప్రియుఁడు (మూర్ఖుఁడు)

అలుక్సమాసము

సంపూర్ణము.

—— :o:——

## సమాసాశ్రయవిధులు.

౧. ఉదక శబ్దమునకు వాస, వాహన, ధి, శబ్దములు పరమైనపుడు 'క' వర్ణము లోపించును.

ఉదక+వాసము=ఉదవాసము

ఉదక+వాహనము=ఉదవాహనము.

ఉదక+ధి=ఉదధి.

౨. ఉదకశబ్దమునకు కుంభ, మంథ, ఓదన, సక్తు, బిందు, వజ్ర, భార, హార, గాహ శబ్దములు పరమైనపుడు కవర్ణము లోపించును ఇదివికల్పము.

ఉదక+కుంభము=ఉదకుంభము; ఉదకకుంభము.

ఉదక+మంథము=ఉదమంథము; ఉదకమంథము.

ఉదక+ఓదనము=ఉదౌదనము; ఉదకౌదనము.

ఉదక+సక్తువు=ఉదసక్తువు; ఉదకసక్తువు.

ఉదక+బిందువు=ఉదబిందువు; ఉదకబిందువు.

ఉదక+వజ్రము=ఉదవజ్రము; ఉదకవజ్రము.

ఉదక+భారము=ఉదభారము; ఉదకభారము.

ఉదక+హారము=ఉదహారము; ఉదకహారము.

ఉదక+గాహము=ఉదగాహము; ఉదకగాహము.

౩. స్త్రీలింగముకాని ఈకారాంత శబ్దమునకు మరొకపదము పరముగానుండఁగా హ్రస్వము వికల్పముగావచ్చును.

గ్రామణీ+పుత్రుఁడు=గ్రామణిపుత్రుఁడు; గ్రామణీపుత్రుఁడు.

౪. సబ్రహ్మచారి, సతీర్థ్య శబ్దము లు నిపతింపఁబడును.

సబ్రహ్మచారి=సహపాఠి.

సతీర్థ్యుఁడు=ఒక్కగురువునొద్ద చదివినవాఁడు.

౫. సోదరశబ్దంబునకు రూపాంతరంబు లెఱుంగునది.

సోదరుఁడు.

సోదర్యుఁడు.

సమానోదరుఁడు.

సమానోదర్యుఁడు.

౬. 'సదృక్' అనుటకు రూపత్రయంబు తెలియునది.

సదృక్, సదృశము, సదృక్షము [సమానమైనది]

ఈదృక్, ఈదృశము, ఈదృక్షము (ఇట్టిది)

కీదృక్, కీదృశము, కీదృక్షము (ఎట్టిది)

అమూదృక్, అమూదృశము, అమూదృక్షము [ఇట్టిది

౭. అన్యశబ్దమునకుఁ గొన్నియెడల తుగాగమంబు బహుళంబుగాఁ జూపట్టెడి.

అన్య+అర్థము=అన్యత్+అర్థము=అన్యదర్థము; అన్యార్థము

అన్య+ఈయము=అన్యత్+ఈయము=అన్యదీయము.

వా. బహుళగ్రహణముచే మొదటిలక్ష్యమందు వికల్పముగను రెండవలక్ష్యమందు నిత్యముగను వచ్చును.

౮. అజాదితృణశబ్దములకు నీచార్థమందు 'కత్' ప్రత్యయము పూర్వమందువచ్చును.

కత్+అన్నము=కదన్నము; (పాసినయన్నము.)

కత్ + తృణము = కత్తృణము; (చెడ్డగడ్డి.)

వరా. హల్సంధి ప్రథమసూత్రముచే 'త' వర్ణమునకు 'ద' కారమువచ్చెను.

౯. పథి, అక్షి శబ్దములకు నీచార్థమందు 'కా' వర్ణము ముందు వచ్చును.

కాపథము = చెడ్డత్రోవ.

కాక్షము = చెడ్డకన్ను.

వరా. పథిశబ్దమునకు సమాసాంత ప్రకరణము మొదటిసూత్రముచేతను, అక్షిశబ్దమునకు బహువ్రీహి సమాసము ౧౨వ సూత్రముచేతను 'అ' కారమంతాదేశముగావచ్చును.

౧౦. ఈషదర్థమందు అజాది హలాది పదములకు 'కా' వర్ణము ముందువచ్చును.

కాజలము = కొంచెమునీళ్లు.

కా + ఆమ్లము = కామ్లము [కొంచెముపులుపు.]

౧౧. పురుషశబ్దమునకు నీచార్థమందు 'కా' 'కు' వర్ణములు ముందుఁ బ్రయోగింపఁబడును.

కాపురుషుఁడు; కుపురుషుఁడు.

౧౨. ఉష్ణశబ్దమునకు ఈషదర్థమందు కవ, కా, కత్ ప్రత్యయములుముందుఁ బ్రయోగింపఁబడును.

కవ + ఉష్ణము = కవోష్ణము కొంచెమువేఁడి

కా + ఉష్ణము = కోష్ణము ,,

కత్ + ఉష్ణము = కదుష్ణము.